

# గృహలక్ష్మి

## స్త్రీల సచిత్ర మాస పత్రిక


సంపాదకుడు:

డాక్టరు. కే. యన్. కేసరి


# GRIHALAKSHMI

## LADIES' TELUGU MONTHLY

జూలై — 1949




సంపుటము ౧౮] [సంచిక ౨




### సాలుచందా మొదలగునవి

ఈ సచిత్రమాసపత్రిక సాలుచందా రు.4-8-0. అర్ధసంవత్సరపు చందా రు.2-8-0. అంతకు తక్కువ కాలపరిమితి చందా పద్ధతి లేదు. విడికాపి ఆరు అణాలు. చందాదారులు ఏమాసమునుండియైన ప్రారంభము చేయవచ్చును. విడికాపీలు వలయువారు వాని విలువమేరకు తపాలాబిళ్లలు పంపవలయును. వీ. పీ. పద్ధతి వ్యయమూలకము. బర్మాకు రేట్లు ప్రత్యేకము.

### ప్రకటనలు

ముఖ్యముగా స్త్రీలకందీయవలసిన వస్తువులనుగూర్చి ప్రకటించుటకీపత్రిక ఎంతయు అనువైనది. ప్రకటన చార్జీలు ప్రతిమాసము ముందుగానే చెల్లింపవలయును. కాలుపుటకు తక్కువదైన ప్రకటనలు చేకొనజాలము. రేట్లకొఱకు వ్రాయునది.

### వ్యాసములు వ్రాయువారికి

వ్యాసముల ముఖ్యాశయము స్త్రీజనాభ్యుదయమైయుండవలెను. అవి సంగ్రహముగ నున్న శీఘ్ర ప్రచురణకు వీలగును. ఒకేప్రక్క సిరాతో స్పష్టముగ తప్పులులేక వ్రాయవలెను. భాష గ్రాంధికముగాని, వ్యావహారికముగాని కావచ్చును; రెండును కలిపి వ్రాసిన అంగీకరింపబడవు. వ్యాసముల ప్రకటించుటలో సంపాదకులకు సర్వహక్కులు గలవు. ప్రకటింప నంగీకరింపబడినపుడు మాత్రము రచయితల కట్లు తెలుపబడును. విమర్శనార్థము పంపు గ్రంథములు రెండుప్రతులు పంపవలెను. రిప్లైకార్డు వ్రాసిననే బదులివ్వబడును.

### సంచికలు చేరనిచో

సంచికలు చేరనిచో ఆయామాసములందు వెంటనే మాకు తెలుపవలయును. చిరునామామార్పును తెలుపకుండుటచే కాపీలు చేరనివారికి తిరుగ పంపజాలము. సంచికలు చేరనివారు తమతమ పోస్టాఫీసులలో కంప్లైంటును చేయునది.

### చిరునామా మార్పు

చిరునామాయందు మార్పుఉండుచో ముందుగానే తెలుపవలయును. ఇట్లు తెలుపనిచో కాపీలు తిరుగ పంపజాలము.

### ముఖ్యమైన గమనింపు

చందాదారులుగ చేర్చుకొనుమని వ్రాయు ఉత్తరములు, ఇతరమైన ఉత్తరములు మానేజరు, గృహలక్ష్మి, రాయపేట, మదరాసు అను చిరునామాకే వ్రాయవలయును. చెక్కులు, మనియార్డర్లు, పోస్టలు ఆర్డర్లు 'కేసరికుటీరం లిమిటెడ్' పేర పంపవలెను.

చెక్కులు మద్రాసు బ్యాంకులపైననే పంపవలెను.

# గృహలక్ష్మి ఏజంట్లు:



గుంటూరు: వెల్కం & కో.
కర్నూలు: బాలసరస్వతి బుక్ డిపో.
బెజవాడ: మాడర్న్ న్యూసు ఏజన్సి.
కాకినాడ: పి. సాంబయ్య
అనంతపురము: వై. సాంబయ్య.
భద్రాచలం: టి. వి. జి. ఆర్. మూర్తి.
దొమ్మగూడెం: సి. హెచ్చి. బాపనయ్య.
నర్సాపూరు: వై. సుందర్రామయ్య.
కావలి: జి. రంగయ్య.
మారుటేరు: వి. వి. సుబ్బారావు.
గుడివాడ: యు. రామమూర్తి పంట్.
పిఠాపురము: యం. నూకరాజు.
కళ్యాణదుర్గం: కె. మల్లప్ప.
నిడదవోలు: కె. సి. సి. అయ్యర్.
మచిలీపట్నము: టి. బి. నారాయణశింగ్.
ఏలూరు: నేషనలు బుక్కుడిపో.
రాజమండ్రి: నేషనల్ ఏజన్సీస్.
తుని: కోడూరు నూకరాజు.
బరంపురం : కె.వి.రంగారావు
విశాఖపట్నం: కె. సుందరేశ్వర్రావు.
కనిగిరి: కె. యస్. శాస్త్రి
పర్లాకిమిడి: బి. యన్. మూర్తి.
ఇచ్ఛాపురం: కె. గంగయ్య
బళ్ళారి: యస్. గురునాథ్
నెల్లూరు. ఎ. వి. నారాయణయ్య.
విజయనగరము : పి. నారాయణప్పడు.
కడప : వై. వి. సుబ్బారావు.
భీమవరం: యన్. సూర్యనారాయణ.
పొన్నూరు: చౌదరి ఖాదీస్టోర్సు
మదనపల్లి: యన్. రాధాకృష్ణయ్య
అంబాజిపేట: పి. రామమూర్తి.
చికాకోలం: బి. యన్. మూర్తి.
వసంతవాడ: యస్. కె. శర్మ.
ఖర్గపూరు: యస్. వి. నాయుడు.
పార్వతిపురము: ఎ. వి. వి. యన్. మూర్తి.
తిమ్మనచర్ల: రాయలసీమ న్యూసుమార్టు.
వాత్తేరు: సిటి న్యూస్ ఏజన్సి.
జగత్యాల: కాసం, శివరాజగుప్త & సన్సు.
రంగూన్: నేషనలుస్టోర్సు.
ఎలమంచిలి: కె దేముళ్ళు.
బాపట్ల: యల్. వి. మనోహరరావు.
నర్సిపట్నము: సి. రామం.
జంషెడ్పూర్: యం. శ్రీరాములు.
తాడేపల్లిగూడెం: జి. సూర్యరావు.
మహబూబ్ నగర్ : ముత్యాలు & సన్సు.
వేలూరు : ఎ. వెంకటశాస్త్రిగారు.
హైదరాబాద్ : నవ్యాంధ్రా ఏజన్సీస్.
కదిరి: జి. సి. కోదండరామయ్య.
గోకవరం: వి. వి గోపాల్ రావు.
పామర్రు: జి. లక్ష్మయ్య.
ఛత్రపురం : వి. వి. రంగాచారి
డోర్నకల్లు : కె. జె. జి. సుందరం.
చోడవరం : పి. విశ్వేశ్వర్రావు.
తిరుపతి : ఆర్. చంచల్ రావు
చీరాల. పి. సూర్యనారాయణ

హిగిన్ బాతమ్ స్టాలులవద్ద దొరకును.

☞ ఇతరచోట్లను ఏజంట్లు కావలయును; డిపాజిటుతో దరఖాస్తు పంపుకోనుడు.

# విషయ సూచిక

# ప్రకటన




ఓకే

[illegible] ఉత్పత్తి చేయబడిన

వంటకొవ్వు నూనె

ఇప్పుడు
అన్ని చోట్ల
దొరకుచున్నది

తయారుచేయువారు:-
ది ఈస్ట్ ఏష్యాటిక్ కంపెనీ (ఇండియా) లిమిటెడ్.
మద్రాసు.

EAZ 1476



"వీరగంధము తీసినానూ,
వీరులెవరో లేచిరండీ !"




జయజయ గృహలక్ష్మి సఖి   జయజయ లలితాంధ్ర మధుర సారస్వతమా!
జయజయ లలనా రత్నమ! జయజయ విద్యాప్రబోధ! జయ కల్యాణీ!

---

# ఆహారసమస్య, గృహలక్ష్మికర్తవ్యము

ఆహారసమస్య – “గృహలక్ష్మి” కి, ఆమెకుసర్వాధికారాలూ గల వంటయింటికి సంబంధించినది_అని ఇదివరకూ అనుకునేవారు. నేడది బ్రహ్మాండమైన ప్రపంచసమస్య అయింది.

కాబట్టే – భారత యూనియన్ ప్రభుత్వ ప్రధాని నెహ్రూ, గవర్నరు జనరల్ రాజాజీ ఈవిషయమై నేడు ప్రజలకు ప్రచారం చేస్తున్నారు. ప్రపంచ పౌరసత్వసమితి అధ్యక్షుడు బాయిడ్ ఓర్ ప్రభుత్వంవారి ఆహ్వానముమీద వచ్చి సలహాయిచ్చి వెళ్లినాడు. ప్రపంచ సమావేశాలవుతున్నవి. అంతర్జాతీయపు ఒడంబడికలు జరుగుతున్నవి. అయితే ఈసమస్య ఇట్లావిశ్వవ్యాప్తి చెందినా - వంట ఇంటిని ‘గృహలక్ష్మి’ ని విడువలేదు.

నెహ్రూ అన్నవి మూడేముక్కలు. మనముఖ్యమైన ఆహారము గోధుమలు బియ్యం. ఇవిపండేవి చాలవు; వీటికితోడు ఇతరపదార్థాలు కూడా చేర్చితినాలి.

అట్లాంటి వానిని అధికంగా పండించాలి. ఆహారపదార్థం వ్యర్థం చేయకూడదు. ఈవిషయంలో బియ్యపన్నం తినేవారి మీదనే ఎక్కువ బాధ్యత పెట్టాడు. విదేశాలనుండీ మనం తెచ్చుకునే బియ్యానికి విలువ ఎక్కువ. గోధుముల ధరతక్కువ; సగానికి సగం. అయినా బియ్యపన్నం తినేవారి కొరకు - నానాటికి ఎక్కువెక్కువ తెప్పించాలిసి వస్తున్నదట. అందుచేత నెహ్రూ బియ్యం తినేవాళ్లు తనసలహాల నెక్కువగా ఆచరణలో పెట్టవలెనంటాడు; అంటే ముఖ్యంగా మన దాక్షిణాత్యులను. రాజాజీ అన్నారుగదా: వరి అన్నం చవిగా ఉన్నా దానిలోసారంలేదు. ఇతర ముతకధాన్యాలను తినడం కూడా అలవాటు చేసుకోవాలి-అని. ఇవన్నీ గృహలక్ష్మి చేతిలోపనులే.

ఆమె తలుచుకుంటే - జానెడు నేలలో తోటకూర, దొగ్గలాకు, టొమాటోలు, బెండకాయలు - ఇట్లా ఎన్నైనా కాయగూరలు పండించవచ్చు. ఇక ఇతర పదార్థాలను ఆరగించడం కూడా ఆమెచేతిలో ఉన్నపనే. నెహ్రూచెప్పే చిరుగడ దుంపలను గాని రాజాజీచెప్పే జొన్నమొదలైన ముతక ధాన్యాలనుగాని - రుచ్యముగా, నాజూకుగా, రోజుకొక్కరకంగా - పచనం చేసిపెట్టితే అందరు తింటారు.

ఆహార పదార్థం వ్యర్థంకాకుండా చూడడం కూడా ఆమెపనే. నిజానికి ఆమెబుద్ధిపూర్వకంగా వ్యర్థంచేయదు. క్రిందబడ్డ మెతుకు మట్టి అయిందనే ఆలోచన కూడా లేకుండానే ఎత్తి ఆకులోవేస్తారు చాలామంది. అయితే అతిథి అభ్యాగతులు వచ్చినపుడు, బంధుమిత్రులను విందులకు పిల్చినప్పుడు, శుభా శుభకార్యముల పట్ల దర్జాకొరకు, డాబుగా పదిపదార్థములు చేయడం, వద్దు వద్దు అని విస్తరి కడ్డుపడుతున్నా ఇనమిక్కిలిగా వడ్డించడం ఇవిసామాన్యంగా గృహలక్ష్మికి సహజ లక్షణాలు. ఎక్కడికైనా విందుకు పోయినప్పుడు 'తిన్నంత పారేయకపోతే నాజూకు కాదనుకుంటారు కాబోల'ని ఆమెకు నిరంతరం జంకు! ఈపద్ధతుల నామెకొన్నాళ్లు కట్టిపెట్టాలి; పిల్లలను పెద్దలనుసహా ఈవిషయంలో శిక్షణలో ఉంచాలి.

ఇన్నివిధాలా గృహలక్ష్మి - మనపరిపాలకులు ఇచ్చేసలహాలను పాటించి ఆహార సమస్య నెదుర్కొనడానికి వారికి తోడ్పడగలదని మేమాశిస్తున్నాము.

“గృహలక్ష్మి” (పత్రికను) నీ నెహ్రూ ఒకకోరిక కోరినాడు. ఆయాసంగతులను నిరంతరం ప్రచారం చేయమన్నాడు. మేము ప్రతీనెలా ప్రచురించే పాకకళ, బ్రతుకు తెరువు, ఇంటిపనులలో మెళుకువలు మొదలైనవి ఇందులకు చాలావరకు తోడ్పడేవి గానే ఉంటున్నాయి. ఇంకా ఇతరవిధములా ప్రచారం చేయను మేమునిరంతరమూ సంసిద్ధులము; సన్నద్ధులము.

---

# బ్రిటన్‌లో సంతాన నిరోధంవల్ల కలిగిన చిక్కులు

పాశ్చాత్యలోకంలో - ముఖ్యంగా బ్రిటన్‌లో గత 50 సం॥లు ఈమధ్య పుటకలు తక్కువ కావడం చేత కల్లోలం ప్రారంభమైంది. 5 సం॥ల క్రిందట ఇది ప్రాణగొడ్డమైన సమస్య అయినదని అనుకొని బ్రిటిష్ దీవుల్లో - విచారణచేసి ఉపాయాలను సూచించను ఒక రాయల్ కమిషన్ ఏర్పాటు చేశారు. వారు 5 గురు స్త్రీలు, 8 మంది పురుషులు- ఈ పదముగ్గురి సంతానమున్నుకలిసి 35 మంది బిడ్డలు; సగటున వ్యక్తికిద్దరైనాలేరు. వీరు ఇటీవలనే 233 పుటల రిపోర్టు తయారుచేసి సమర్పించగా ప్రచురమైనది.

♦ ♦ ♦

ఈ రిపోర్టు చదివిన అందరికీ సంతానాపేక్ష కలిగిన దట. వారా రిపోర్టులో వ్రాసిన ముఖ్యసారాంశం. బ్రిటన్‌లో ప్రతి 5 గురు దంపతులలో ఒక్క జతైనా, ఇప్పటికన్నా ఒక్క శిశువును ఎక్కువ కనకపోతే బ్రిటన్‌కు చాలా ప్రమాదం. నేడది ప్రపంచంలో మొదటిశ్రేణిదేశం-అయితే ఏవిధంగా సంతానం వృద్ధికాకపోతే ఇక 30 సం॥లో ఆ ఉన్నత స్థానం తొలిగిపోతుంది.

♦ ♦ ♦

పూర్వం ఇంగ్లాండులోను మన దేశాలలోవలెనే కుటుంబవృద్ధి ఉండేదే. రానురాను నాగరికతబలిసి సంతానవృద్ధి తగ్గింది. వివాహితులైన దంపతులకు ఇప్పుడు సగటున 2.2 మంది బిడ్డలు.

♦ ♦ ♦

గత శతాబ్దాలలోకన్నా ఇప్పుడు బ్రిటన్‌లో ప్రసూతి చికిత్సా సౌకర్యాలు, ఆరోగ్యవిధులు, గృహవసతి, వైద్యసహాయము, ఇతరసామాన్య జీవిత పరిస్థితులు అన్నీ బాగుపడ్డాయి. అయినా సంతానాభివృద్ధి మాత్రం మందగించింది.

♦ ♦ ♦

ఇందుకు ముఖ్యకారణం సంతాన నిరోధక పద్ధతులు. ఈ పద్ధతులు ఏదోరూపాన - ప్రాచీనమగు ఈ జిప్టు నాగరికత వర్ధిల్లుచున్న నాటిమొదలు ఈ 4000 సం॥లనుంచీ అమలులోఉన్నా, నేటివలె అవి ఎన్నడూ విస్తారంగా అవలంబించబడలేదు.

♦ ♦ ♦

ఈ విచారణ సంఘమువారు గత 5 సం॥లలో 14,00,000 మంది పెండ్లయిన పడుచుల సాక్ష్యం పుచ్చుకున్నారు; అంటే బ్రిటన్‌లోఉన్న వారిలో వీరు 10 వ వంతు అన్నమాట. వాళ్లను అనేక ఆంతర్య విషయాలు అడిగి తెలుసుకున్నారు.

♦ ♦ ♦

ఈ రిపోర్టువల్ల - ప్రజలు భయోత్పాతులైనారని చెప్పరాదు గాని ఇప్పుడే మేలుకోకపోతే మరుసటి తరం వచ్చేసరికి బ్రిటన్ మూడోరకపు దేశమై పోతుందని మాత్రం తెలుసుకున్నారు.

♦ ♦ ♦

నేను - ఉత్తరపు ఐర్లాండును చేర్చకపోతే బ్రిటిష్‌దీవుల జనాభా - 490 లక్షలు; అంటే ప్రపంచంలో జనాభాపరంగా - పెద్దపెద్ద దేశాల క్రమంలో - 8 వదిగా అయింది. 250 సం॥ల క్రిందట దీని జనాభా 70 లక్షలే. అప్పటినుంచీ పుటకలూ చావులూకూడా హెచ్చుగానే ఉండడం చేత - నెమ్మదిగా వృద్ధిఅవుతూ వచ్చింది. 19 వ శతాబ్దంలోవలెనే వృద్ధిఅయి ఉన్నట్లైతే, 2000 సం॥ నాటికి (అంటే ఇంకా 50॥లకు) 1300 లక్షలు కావాలి; 2100 నాటికి - 4600 లక్షలు కావాలి. అది దుర్భరం. ప్రకృతి సిద్ధంగా జరిగే తరుగేగాక కృత్రిమోపాయాలవల్లకూడా కొంత జరగడంచేత తగ్గుదల మరీ హెచ్చిపోయింది.

♦ ♦ ♦

విక్టోరియామహారాణి కాలంలో ఈ తగ్గుదలకు ప్రారంభం. ఆమె 1841 లోనే తన పినతండ్రి అయిన బెల్జియంరాజుకిలా వ్రాసిందట. "మనకు కుటుంబాలు పెరిగి పోవడమునే పెద్ద సంకటం వకటి కల్గుతున్నది; అందులో ముఖ్యంగా నాకు. పదే పదే ఆడవాండ్లము పడే ప్రసూతిబాధ మగ వాళ్లకు సుతరామూ తెలియదుగదా." పాపం అట్లా అంటూనే ఆమె 9 మందిని కన్నది. ఈ రోజుల్లో

బ్రిటన్‌లో 9 మంది బిడ్డలను కన్నతల్లే కన్పిస్తే- అదేదో గొప్పవింత; విశేషం.

♦ ♦ ♦

1870 లో ఈ తగ్గుదల మొదట కన్పించింది. అనేక కారణాలచేత, అందులో ముఖ్యంగా ఆర్థిక కారణాలవల్ల. మధ్యతరగతి కుటుంబాలే హెచ్చుగా, 5, 6 గురు పిల్లలకంటే హెచ్చుకలిగారంటే - కట కట పడసాగేరు. అయితే నాటివలె నేడు - ఒక రిద్దరు బిడ్డలనుగాక 5, 6 గురు పిల్లలను పెంచడానికి దార్ఢ్యంలేకపోలేదు. కాని నేడు జీవితాన్ని అన్ని విధాలా ఎంతో మనోహరంగా అనుభవించడానికి అనేక అవకాశా లేర్పడ్డాయి. అందుచేత పిల్లలు హెచ్చితే జంజాటకం. మంది ఎక్కువైతే మజ్జిగ పల్చన. పిల్లలు ఎక్కువైతే తల్లిదండ్రుల విలాసాలు కొరతపడతవి ; పిల్లలకు హెచ్చుస్థాయిలో పోషణ జరుగదు ; చదువు అమరదు.

♦ ♦ ♦

ప్రపంచమంతటా ఈ విషయంలో ఒకటేనీతి. పేదవాళ్లయ్యేకొద్ది పిల్లలు హెచ్చు. భాగ్యవంతు లయ్యే కొద్దీ - సౌఖ్యాలు మరిగి బిడ్డల జంజాటకం హెచ్చుగా కోరరు.

♦ ♦ ♦

అయితే అసలు కారణం - విరివిగా సంతాన నిరోధక సాధనాలుపయుక్తం కావడం.

♦ ♦ ♦

అసలీ నూతన విశేషానికి ప్రాతిపదిక వేసినది శ్రీమతి అనిబిసెంటు, చార్లస్ బ్రాడ్లా. సంతాన నిరోధక సాధనాలు ఉపయోగించడం విషయంలో 1877 లో విచారణజరిగిన కేసే వీని ఉపయోగానికి ప్రోత్సాహకరమైనది. ఆ పిదప 14 సం||లలో 10 లక్షల సాధనాలు అమ్ముడు పోయినవి. గిరా కీకి తగినట్లు సరుకు ఉత్పత్తికా నారంభించినది.

♦ ♦ ♦

1871-81 ల్లో కన్నా 31-41 ల్లో జనాభా చాలా హెచ్చు. అయితేనేమి - పుటకలుమాత్రం (1931-41) 30 లక్షలు తక్కువ. అప్పుడు ఇప్పుడు పెండ్లిచేసుకొన్నవారి దామాషా ఒకటే.

♦ ♦ ♦

యాంత్రిక పరిశ్రమలు వృద్ధిపొందడంచేత స్త్రీ పురుషులలో సృజనశక్తి మందగించినది - అని కొంత మంది అంటున్నారు. మరి కొంతమంది ఆధునిక కాలపు నాగరిక జీవితమున్నూ, వేడినీళ్ల స్నానా లున్ను, వ్యవసాయంలో కృత్రిమపు ఎరువులున్నూ, ఇంకా ఇట్టివే అనేకమున్నూ ఈజనాభా వృద్ధికాక పోవడానికి కారణాలు అని చెపుతున్నారు. అయితే కమిషన్‌వద్ద సాక్ష్యంలో ఇవి ఋజువుకాలేదు.

♦ ♦ ♦

డా. లూయీ ఫానింగ్ అనే ఆయన మానవుల సంతాన వృద్ధినిగూర్చి పరిశోధనలు గావించాడు. విక్టోరియా రాణి రోజులలోవలె బహుసంతానాపేక్ష యున్నవారికి, ఈ నాడున్నూ, సఫలీకృతులు గావ డానికి బ్రిటన్‌లో అసాధ్యముకాదు - అని ఆయన అన్నారు.

♦ ♦ ♦

ఈలాంటి సాక్ష్యాన్నంతా పురస్కరించుకొని విరివిగా సంతాన నిరోధక విధానం అవలంబింప బడడంచేత బ్రిటన్‌లో కుటుంబాలు సన్నగిల్లాయని కమిటీవా రన్నారు.

♦ ♦ ♦

1900-1930 సం||ల మధ్య వివాహాలు చేసు కొన్న దంపతుల కుటుంబవృద్ధినిగూర్చి ఆరాతీశారు. కార్మికులలో కాయకష్టం చేసేవారు కొందరు ; కర్రపెత్తనం చేసేవారు కొందరు. వారిలో కాయ కష్టం చేసేవారి కుటుంబాలు 40% హెచ్చుగా వృద్ధిఅయినవట. పరిశ్రమలు హెచ్చుగాఉన్న ప్రాంతాలలోకన్నా వర్తక వాణిజ్యాలు వృద్ధిగా ఉండే పట్నవాసాలలో కుటుంబాలవృద్ధి మందగిం చింది. పరిశ్రమలుండేచోట్లనైనా - స్త్రీలుకూడా పనిపాట్లకుపోని ప్రాంతాలలోనే సంతానవృద్ధి. గత శతాబ్దాంతంలో అచ్చట - ఊరక జనాభావృద్ధి అయిందంటే - ఆహార పదార్థం క్లుప్తమైపోతుంది

అనే భయంచేత - సంతాననిరోధక ప్రచారము సాగినది. తన్మూలాన కృత్రిమంగా సంతానవృత్తి నిరోధింపబడినది.

♦ ♦ ♦

స్త్రీల హోదా క్రమంగా వృద్ధి అయింది. భర్తలున్నా భార్యలను ఎక్కువ చనవున పోనిచ్చారు. ఈ రెండున్నూ సంతానము క్లుప్తం కావడానికి కారణాలైనవట.

♦ ♦ ♦

కమిషన్‌వారు మరో రహస్యంకూడా బయటపెట్టారు. నెలలు నిండాక గర్భస్రావములకు పాల్పడడముకూడా దారుణంగా హెచ్చినదట.

♦ ♦ ♦

పూర్వం 19 వ శతాబ్దంలో జర్మనీ ఫ్రాన్సుల మధ్య ఇలాగే జరిగిందట. ఈ తారుమారువల్ల పశ్చిమ దేశాల పరువు ప్రతిష్ఠలు పలుకుబడి క్రుంగిపోతుందికూడా - అని కమిటీవారి భయం.

♦ ♦ ♦

లౌకిక వ్యవహారాల పాల్గొనదాని కలవాటుపడ్డ స్త్రీలు తిరిగీ ఇంట్లో కట్టుబడి ఉండమంటే ఉంటారా? అంచేత - బిడ్డల తల్లులు వ్యవహారం మీద ఇంట్లో లేనప్పుడు ఆయా విధాల సంతాననిరోధం జరగడంచేత - కలిగే ప్రమాదాలు చాలా, అందులో ముఖ్యమైనది - దేశసంరక్షణకు కలిగే ముప్పు. రాగల పది సం||లలో 15-40 సం"ల మధ్య వయసువాళ్ల సంఖ్య చాలాపడిపోతుంది.

♦ ♦ ♦

బ్రిటన్‌లో క్రమంగా "బిడ్డలే లేకుండా పోతారేమోననే భయం మాత్రం లేదన్నారు. ఏమంటే 15 సం||లలోపు బిడ్డల దామాషా ప్రస్తుతం 21-4% ఇది ఎంత తగ్గినా 19% తగ్గదని కమిటీవారి అభిప్రాయం.

♦ ♦ ♦

కేవలం దేశసంరక్షక సమస్యయేగాక-పాశ్చాత్య దేశాల విజ్ఞానం - సాంప్రదాయాలు - నిలవబెట్టుకొని - పెంపొందించడం కూడా కష్టసాధ్యమని కమిటీ వారి గోల. ఇట్టి దురవస్థ తప్పించడానికి కమిటీవారు సూచించిన సదుపాయాలు: కుటుంబ వృద్ధి గలవాళ్లకు ధనమిచ్చి ఆర్థికంగా సహాయం చేయడం ఇన్‌కంటాక్స్ కొంత తగ్గించడం;

♦ ♦ ♦

పాశ్చాత్య దేశాలన్నిటిలోను జనాభివృద్ధి మందగించడము పరిపాటి అయిపోయినది; కూడ దీయడం అసాధ్యమైపోతున్నది. కాని ప్రాచ్యదేశాలలో జనాభివృద్ధి సక్రమంగా జరిగిపోతున్నది.

♦ ♦ ♦

ఆ బిడ్డలను లాలించి, ఆదరించి, చదువుకూడా చెప్తే నేర్పుగల ఆడనౌకరీలకు అవకాశాలు కల్పించాలి అని కూడా మరో సూచనచేశారు.

♦ ♦ ♦

వీటన్నిటికి డబ్బు కావలె. ఆర్థిక సభ్యునికి తల దిమ్మెక్కినది. కొన్నికోట్లు అయితేగాని-సాగదు.

♦ ♦ ♦

రిపోర్టులో మరొక మాటకూడా వ్రాశారు. కావాల్సింది. మొత్తంమీద జనాభా వృద్ధిగాదు. తెలివితేటలుగల మధ్య తరగతివారి సంతానం వృద్ధి కావాలి; ఏమంటే కేవలం కార్మికుల సంతానం హెచ్చి - మధ్యతరగతివారి వృద్ధి తగ్గిపోవడం మూలాన దేశానికి మొత్తంమీద తెలివితేటలు మందగిస్తున్నాయని వారి గోల.

# రాష్ట్రేతరాంధ్ర నారీమణుల నాట్యకళారాధన



శ్రీమతి భా. శారద, ఆంధ్రాక్లబ్బు స్త్రీశాఖ సహాయ కార్యదర్శిని గారు ఇట్లు వ్రాసిరి:

తే॥ 2 4-1949 ని నాగపూరు ఆంధ్రాక్లబ్బు స్త్రీ శాఖసభ్యులు మద్రాసీ గరల్ స్కూలు హాలులో "సౌందరనందము" అనునూతన నాటకమును ప్రత్యేకముగ ఆంధ్ర స్త్రీలయెదుట ప్రదర్శించిరి. ప్రయత్నము ప్రథమమయ్యును ప్రదర్శనము విజయవంతముగ జరిగినది. సుమారు 200 వరకు స్త్రీలు, బాలికలు నాటకమును చూచి హర్షించిరి. ఇది ఇందలి ప్రేక్షకుల ప్రత్యేకత: వేషధారులందరు స్త్రీలుమాత్రమే! నాటకము అతినూతనము; ప్రథమ ప్రయత్నము!

నాటకము :- "సౌందరనందము"ను కావ్యమును శ్రీ ఆచార్య పింగళి లక్ష్మీకాంతం కవిగారును, శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు గారును తెలుగున విరచించిరి. ఇది ఆధునిక కావ్యములలో ఉద్గ్రంథమని చెప్పవచ్చును! కాని "సౌందరనందము" తొలుత చదువునప్పుడే ఆగ్రంథము నాటకమయి యుండవలసినదని ఎవరైన గుర్తింపగలరు. కవుల నాటకకళా కౌశల మారచనయందే తేటపడును. కావ్యరూపమున రచించినను కవులు నాటకకర్తలే! కవుల నాటకకళానిపుణతకు తార్కాణము అందలి పెక్కుపద్యములు సంభాషణా క్రమముననుండుటే. సర్గలన్నియు చక్కని నాటకోచిత భూమికలు. పాత్ర పోషణ నాటకానుకూల్యము! కొలదిమార్పులతో "సౌందరనందము" నాటకము కాగలదు.

ఈ కావ్యమును మార్పులేమియు చేయకయే నాటకరూపముగా చేసి, స్త్రీలకుచిత పాత్రపోషణల నలవరించి, ప్రదర్శనమునకనువగు రంగస్థలము నేర్పాటుచేసి ప్రేక్షకుల కాహ్లాదము కలిగించిన శ్రీ భాగవతుల పూర్ణయ్యగారు అభినందనీయులు. పరరాష్ట్రముల నివసించుచు భాషాభిమానముతో కవితాసేవ చేయుచు శ్రీ పూర్ణయ్యగారు నాగపూరాంధ్ర సంఘ సౌకర్యమునకై తొలుత "బహిష్కారము" "భక్తత్యాగరాజు" లను సరిక్రొత్త నాటకముల స్వయముగా రచించిరి. అందు "బహిష్కారము"ను నాటకము నాగపూరులోను, పూనాలోను ప్రదర్శింపబడి ఆమోదింపబడినది. ఈయన ఇంకెన్నెని క్రొత్తనాటకముల రచించి ప్రసాదింతురని ఆశించుచున్నాము.

ప్రదర్శనము :- నాటకమున "సుందరి" పాత్రనటించిన చి॥ వెంకరాల విమలా కుమారికి క్లబ్బు కార్యదర్శి గారిచే ఒక రజతపతకము బహూకరింప బడినది. మరియు గౌతమబుద్ధుడు, శుద్ధోదనుడు, నందుడు మొదలగు పాత్రలుకూడ చక్కగా నటింప బడినవి. ఈ సందర్భమున భోగుచేయబడిన పైకము స్త్రీ శాఖగ్రంథాలయమునకు జెందును.

# శ్రీ తులస్యష్టోత్తర శతనామ స్తోత్రం

శ్రీ మాతా తులసీనామా గోపీగోలోకవాసినీ ।
కృష్ణప్రియతమా కృష్ణభోగాఽ సంతృప్తమానసా ॥

మాధవీగర్భసంభూతా ధర్మధర్మధ్వ వరాత్మజా ।
శతాబ్ద మాతృగర్భస్థా శుభలగ్న సముద్భవా ॥

రాధాశాపనిమిత్తజ్ఞా భూలోకసుఖవాసినీ ।
లక్ష్మీసఖీచ కార్తీకపూర్ణిమా సితవారజా ॥

శరత్పార్వణచంద్రాస్యా శరత్పంకజలోచనా ।
పక్వబింబాధరోష్ఠీచ పద్మాంశా తిమనోహరా ॥

హస్తపాదతలారక్తా నిమ్ననాభిమనోరమా ।
సునాసా త్రివళీయుక్తా నితంబయుగవర్తులా ॥

శీతకాలోష్ణ సర్వాంగీ గ్రీష్మకాల సుశీతలా ।
నీలాలకా మహావేణీ న్యగ్రోధపరిమండలా ॥

పీతచంపకవర్ణాభా సుందరీజనసుందరీ ।
బదరీవనవాసస్థా శ్రీకృష్ణధవకామనా ॥

గ్రీష్మపంచాగ్ని మధ్యస్థా శీతార్ద్రాంబ ధారిణి ।
శరద్వింశకసాహస్రక్షీరతోయ ఫలాశనా ॥

శర త్రింశక సాహస్రపత్రాహా కృశోదరి ।
చత్వారింశ త్సహస్రాబ్ద వాయ్వాహారా తపస్విని ॥

దేవాబ్ద దశసాహస్ర నిరాహారా నిరామయా ।
దేవాబ్దలక్షకాలైకలక్ష్యా ఏకాంఘ్రిసంస్థితా ॥

శ్రీ షోడశాక్షరీత్యాతి రాధామంత్ర జపాన్వితా ।
విధిలబ్ధవరా శంఖచూడ ప్రియతమాసతీ ॥

శంఖచూడ మనోల్లాసా పాతివ్రత్య పరాయణా ।
మన్వంతరావధీ శంఖచూడ ప్రాణప్రియావరా ॥

స్వసేవకజనానంత ఫలదా విష్ణువంచితా ।
శ్రీకృష్ణదర్శనానందా శ్రీవిష్ణుస్నేహ మూర్ఛితా ॥

స్వశాపలబ్ధశ్రీవిష్ణు సాలగ్రామ శిరోమణీ ।
త్యక్తదేహా దివ్యదేహా గోలోకగామినీ ॥

స్వకేశవృక్షరూపాచ స్వతను ర్గండకీనదీ ।
శంభోపరిస్థితానందా శ్రీ సాలగ్రామమండనా ॥

తిరోధానముఖీ కృష్ణస్తుతి ప్రీతా మహామనా ।
బృందాబృందావనీ విశ్వ పూజితా విశ్వ పావనీ ॥

పుష్పసారా నందినీచ తులసీ కృష్ణజీవనీ ।
స్వనామస్మరణానందదాయినీ కృష్ణపూజితా ॥

విష్ణువక్షస్థితాలోల మాలాకృష్ణాంఘ్రిభూషితా ।
కృష్ణదత్తాత్మసౌభాగ్య కృష్ణధ్యానపరాయణా ॥

కృష్ణదత్తవరైశ్వర్యాసుర బృందాంఘ్రిపూజితా ।
కవికల్మషపాపఘ్నీ గృహస్థజనపూజితా ॥

స్వస్పర్శజన వైకుంఠదాయినీ రాధికాసఖీ ।
సురపూజ్యాశుభాకారా సౌభాగ్యజనభాగ్యదా ॥

ధర్మాధర్మానసాదేవీ దేవదేవమనఃప్రియా ।
బృందావనజనానందా భగవత్ప్రీతి కారిణి ॥

శ్రీకృష్ణక్రీడనాసక్తా రాసమండలమండనా ।
స్వదళార్చిత శ్రీకృష్ణ భక్తసామ్రాజ్యదాయినీ ॥

శ్రీకృష్ణపాదసంలగ్న చిత్తా శ్రీకృష్ణకింకరీ ।
భుక్తిదాముక్తిమూలాచ గృహస్థగృహపావనీ ॥

మందస్మితముఖాంభోజా పవిత్రదళరూపిణీ ।
భవసంతాపశమనీ సర్వసంపత్ప్రదాయినీ ॥

ఇతి శ్రీతులస్యష్టోత్తర శతనామస్తోత్రం సమాప్తం

శ్రీ శ్రీ శ్రీ

[ఇదియు శ్రీ గం॥ వెన్నెలగంటి హనుమాయమ్మ గారి గ్రంథభాండారమునుండి
కీ॥ శే॥ వంగోలు వెంకటరంగయ్యగారు సంపాదించిపంపినది. గృ॥ సం]



# సోదరీ హితోపదేశము గ్రంథపఠనము

శ్రీమతి వేదుల మీనాక్షీదేవిగారు

ఓవనితామణీ! పనులనొయ్యన నీవొనరించి భర్తకున్
పావనమూర్తులైన పసిపాపలకెల్లర కన్నపానముల్
సేవలొనర్చినావిక పఠింపగనేపని యున్నదింటనీ
వేవియొ పొత్తముల్ గొని పఠింపగరాదె కుతూహలంబునన్.

పొరుగుపెత్తనముల ప్రొద్దులుబుచ్చగా కలహంబుకల్గుట కల్లగాదు
పలువురొక్కటిగూడ పరులనేరంబులు వెదకివాక్రుచ్చుట వింతగాదు
ఏకతంబుననుండ నేవియొకలతలు భావముగలచుట బ్రమ్మగాదు
కొంతనిద్రను మరికొంత వ్యర్థముగను కాలముగడచు టక్కజముగాదు

గ్రంథపఠన వలనకలుగదు వైరంబు;
నణగు నొరులనెంచు గుణము. నెదకు
శాంతిగలుగు నీకు. సద్వినియోగంబు
నొనరఁజేయు కాల మనవరతము.

పాయని వేడ్కతో నెపుడు భాగవతంబును భారతంబు రా
మాయణముల్ పఠించిన, రమాధవు ప్రేమకు పాత్రమౌట కా
దో యలినీలవేణి! కడునుత్తమ వాఙ్మయమున్ పఠించిన
హాయొసగున్ గదే సమయ మైనపుడెల్ల పఠింప గాదగున్.

కవిరాణ్ణన్నయ తిక్కయజ్వలును వాగర్థంబులన్ పెంపుసొం
పువహింపన్ రచియించు కబ్బములునీపుణ్యాన గల్గంగ నీ
వవికన్గొ నేవియో నిరర్థకతా వ్యాపారముల్ మానుమో
యువిదా! వానిపఠింపుమా తీరికై యున్నప్పుడెవ్వేళలన్.

పట్టణంబుల యందును పల్లెలందు
గ్రంథముల కొట్టి లోపము గలుఁగదిపుడు
తెత్తురింటికి వలసిన పొత్తములను
వాని పఠియింప రాదొకో వారిజాక్షి!

—:(::)—

# గృహలక్ష్మికి పద్యరత్నాలు

కల్లూరు అహోబలరావుగారు

(జూన్, సంచిక తరువాత)

'కావ' ని బిడ్డం డఱచెను 'కావుమయా! దేవ దేవ! కారుణ్యనిధీ'
కావుము, కావు మటంచును రావే! రక్షింపవేగరా గృహలక్ష్మీ!

గృహలక్ష్మి యనెడినామము గృహలక్ష్మికి నేఁడుదక్కె; గృహము సులక్ష్మీ
సహితమయి వన్నెకెక్కెను; మహిమోన్నత పుత్రువలన మాగృహలక్ష్మీ!

శుభమని పల్కెఁ బురోహితుఁ డభయ మిడిరి సురగణంబు లంబరవీథిన్
విభవోన్నతుఁ డయి వెలయును ప్రభవుఁడు సుగుణాకరుండు; ప్రాగృహలక్ష్మీ!

బొడ్డుగ్గోసెను సావిక బిడ్డనికి న్మెల్లమెల్లఁ బ్రియమింపారన్
గొడ్డముగడచె; శుభంబులు దొడ్డగనీకడరు, నమ్మెదోగృహలక్ష్మీ!

బోర్కాడించిరి తల్లులు అర్క ప్రభతోడ వెలుఁగు నర్భకునకు; వే
శర్కరను బంచిపెట్టిరి; కూర్కొనెఁ జనుఁ గుడిచి, పుత్రకుఁడుగృహలక్ష్మీ!

వచ్చిన పేరంటాండ్రకుఁ జెచ్చెర తాంబూలములను చిఱున వ్వొసఁగన్
ఇచ్చెను నీతల్లియు, నిప్పచ్చరముల్ ప్రేమగెల్చు; వరగృహలక్ష్మీ!

పట్టణమున, నీవుండిన పట్టీ! ఆస్పత్రిమందు వాడగవచ్చున్
దిట్టయగు మంత్రసానియు నెట్టన సాయంబువచ్చు; నిజగృహలక్ష్మీ!

పల్లెల నీవుండిన, నీ తల్లియె నీ సేమమెఱిఁగి తథ్యముగాఁగన్
జెల్లించు నీకు సేవలు ఫుల్లాంబుజ నయన! తెలియు మోగృహలక్ష్మీ!

బ్రాందియుఁ గస్తూరియు, నీ కందించును వెచ్చదనము నారోగ్యంబున్
కొందల మందక వాటిని మందులవలె వాడవలయు; మాగృహలక్ష్మీ!

వైద్యుఁ డొసంగిన మందులు హృద్యంబున వాడవలయు నిదియదియనకన్
విద్యావతి! నీవిప్పుడు వైద్యుని సలహాలు వినగవలె; గృహలక్ష్మీ!

పదిపగలులు, బదిరాత్రులు బదిలముగాఁ గడవ వలయు వనజాక్షిరో! నీ
వదిలే దిదిలే దన కెయ్యది పెట్టిన నదియ తినగనగు; గృహలక్ష్మీ!

తల్లియొసంగెడి శిక్షణ ముల్లంఘన దాటకీవు ముగుదరో! నడువం
జెల్లును; యాయమ కనుభవ మెల్లగనుక, వినగవలెసుమీ; గృహలక్ష్మీ!

ఆయుర్వేదపు మందులు వేరువిధంబుగ నుండు వెలదీమణి! నీ
కేయేమందులు బథ్యమొ ఆయౌషధముల గ్రహింపుమా గృహలక్ష్మీ!

వెల్లుల్లి పుడులఁ జేర్చియుఁ దల్లీ! యన్నంబుఁ దినఁగఁదగు; వెల్లుల్లిన్
త్రుళ్లాడియు నిరసింపకు ఫుల్లాంబుజ నయన! తెలియుమో గృహలక్ష్మీ!

వెల్లుల్లి వాడకంబునఁ బల్లెలలోఁ బడఁతులెల్లఁ బలయుతులై నా
రల్లారు ముద్దుగాగను పిల్లలు బెంపొందినారు; ప్రియగృహలక్ష్మీ!

బాలెంత లుల్లిఁ దినినన్ బాలూరును వృద్ధిగాఁ గఁ బాలింట్లందున్
పాలింట్లు జేపుగల్గిన బాలల పోషణము జరుగు; వరగృహలక్ష్మీ!

ఆకొన్న పాపనెత్తుచు జోకొట్టియుఁ జన్నుఁగుడిపి చుంచు నివురుచున్
రాకేందు మించుపుత్రుని మూకొని ముద్దిడుట భాగ్యమో గృహలక్ష్మీ!

పురిటిల్లు గాలివెలుతురు చొరఁగా వీలుండి నిండుశుభ్రతతోడన్
మురియుచు నుండగవలయును తరుణీమణి! దీనిఁ దెలియఁదగు; గృహలక్ష్మీ!

చీఁకటి కొంపలలోపల ప్రాఁకుచుఁ బలుకీటకములు పాములు దేళ్లున్
చీకాకుఁబఱచుఁ గావునఁ జీఁకటిలో నుండఁదగదు; శ్రీగృహలక్ష్మీ!

చలిగాలి యెక్కువగుచో వలిగొట్టుచు శీతమగును, బాధాకరమౌ
అలివేణి! వీనిఁ దెలిసియు మెలకువతో మెలఁగవలెసుమీ; గృహలక్ష్మీ!

కట్టులతో, నుండుము; తల కట్టులు, నడికట్టు అపుడు కాంతామణిరో!
దిట్టముగ నుండవలయును; కట్టుఁబడితి వమ్మనేఁడు ఘనగృహలక్ష్మీ!

ఉత్తమమగు మంచముపై మెత్తగ వేయంగఁ బడిన మెత్తలపై, నో
బిత్తరి! నీపాపనితో బిత్తరముల నాడవలయు; ప్రియగృహలక్ష్మీ!



(సశేషము)




శ్రీమతి గుడిపాటి వెంకట సుబ్బమ్మగారు

మూర్తిగారు ఒక గౌరవసంపన్న గృహస్థులు. వీరు బ్రాహ్మణులు. ఇద్దరుపిల్లలు వీరికి. ఒక ఆడపిల్ల, ఒక మొగపిల్లవాడు. ఆడపిల్లే పెద్దది. పిల్లాడు ఒకసంవత్సరం వయస్సువాడు. వీరిభార్య సుశీలాంబ. ఈమె అంత అందమయినది కాకపోయినా అనాకారి మాత్రం కాదు. మరియాద కుటుంబంలోంచి వచ్చినపిల్ల. పేదలయందు దయకలది. కుటుంబంలో మంచిపేరు తెచ్చుకోవాలని యీమెకోరిక. వీరి స్వగ్రామం రాజోలు. ఈవూరులో వీరికి యిల్లూ భూములూ వగైరా అన్నీవున్నాయి. ప్రస్తుతం మెడ్రాసులో మూర్తిగారికి పనిఅవడంవల్ల ఒకచిన్నమేడ అద్దెకుతీసుకుని వుంటున్నారు: మకాం అంతాక్రిందే. పడుకోడానికిమాత్రం ఒకగదిఉంది పైన. తక్కిన భాగమంతా విశాలమైన డాబా. మూర్తిగారికి భార్యమీద యెంతో ప్రేమ. ఆఫీసువదలి యింటికి రాగానే బట్టలు మార్చడం తిన్నగా వంటింటిలోకి రావడం మామూలు. సుశీలాంబ యేకారణంచేతేనా అక్కడలేకపోతే పిల్లలతో 'మీ అమ్మేది, ఏంచేస్తోంది, ఎక్కడవుంది?' అంటూ వాళ్లజవాబేనా వినకుండా ఆమెను వెతుక్కుంటూ దొడ్డివేపునకు వెళ్లేవాడు. పోనీ అంటే యేమీపనిలేదు. అవిడను చూడ్డమే నేమో ఆయనపని. ఆమెకూడా భర్తయందు భయభక్తులు కలిగివుండేది. కాని ఎంతోచనువు. వీరిదాంపత్యం వీరికేకాకుండా చూసేవాళ్ళకి కూడా ఎంతోముచ్చటగా వుండేదని చెప్పొచ్చు. అన్నీబాగానే వున్నాయి. కాని అభిప్రాయాలు కొద్దిగా తేడా. అంచేత వాగ్వివాదాలు జరుగుతూ వుండేవి. మూర్తిగారిది అంతా ఆధునికనడవడిక. సుశీలది ప్రాచీనపద్ధతి. కొంతవరకు తన ఉద్దేశం తెలియపరచి ఆయన యెల్లాగా వినరని వూరుకునేది సుశీల. అందువల్ల మూర్తిగారే వాగ్వివాదాల్లో విజయం పొందేవారు. అసలు ఆమె వాదిస్తుంటే చూడాలని అదొకవిధమైన సరదా మూర్తిగారికి. ఒకనాడు మాటలవరుసని ఆడవాళ్ళకి పక్కపాపిడి అందం అన్నారు మూర్తిగారు. కొంతవయస్సుదాకా అందమేగాని మొత్తంమీద మధ్యపాపిడి కున్నంత అందమురాదంది సుశీల. తక్షణం మూర్తిగారు అందుకుని కొంత వయస్సేమిటి ఎంతవయసు వచ్చినా, జుట్టు, బొట్టు, కట్టు అన్నీదిద్దుతే వయస్సు కూడా కనబడదన్నారు. ఎప్పుడు అల్లాగే ఉంటాయి మీమాటలు. ఏంచేసినా వయస్సు మొఖం మీదకనపడి తీరుతుందని యీమె వాదన. తనమాట నిజమనిపించాలని మూర్తిగారిపట్టు. చివరకి ఎల్లాగా తెమిలేదికాదని సుశీలే వూరుకునేది. ఇవేవివాదాలు. 'ఏం సుశీలా! నువ్వోడిపోయావుకదూ చివరకి' అనిన్వేవారు మూర్తిగారు.

ఇల్లా సరదాగా కాలం గడపడం దేమునికి యిష్టం లేదన్నట్టు ఏదోట్రెయినింగని బెంగుళూరు వెళ్ళమన్నారు ఆఫీసువారు. వెళ్ళకతప్పదు. భార్యనీ పిల్లలని తీసుకు వెళదామా అంటే కూతురుచదువులోంది. ఐదోక్లాసుగాని చదువు పాడుచెయ్యడం మూర్తిగారికి యిష్టంలేదు. పోనీ అంటేరెండునెల్లు ట్రెయినింగు అయ్యాక మళ్లీయిక్కడికే వొచ్చెయ్యాలి. ఆబెంగుళూరులో యీరెండునెల్లభాగ్యానికి యిల్లెక్కడ దొరుకుతుంది? ఆయన ఒక్కరూ అయితే ఏహోటల్లోనో గడిపి వస్తారు, అని తనవల్ల భర్తకి యిల్లూ అవీచూడ్డం శ్రమ అని సుశీలాంబ తీర్మానించుకుని, పిల్లచదువు పాడవకుండాను భర్తకి శ్రమలేకుండాను రెండునెలలు యిక్కడే గడుపుకుంటాననంది. సరేనని తీర్మానించుకున్నారు యిద్దరూను.

రేపే ప్రయాణం. సర్దడాలన్నీ అయిపోయాయి. రాత్రితొమ్మిది కొట్టారు. రేపటినుంచి రెండు నెల్లు ఎల్లాగడుస్తాయా అనిబాధ యిద్దరికీని. పైకిమాత్రం ధైర్యంగా వున్నారు ఒకళ్లకంటే ఒకళ్లు. సుశీలాంబ కమలపాకులకు సున్నము రాస్తూవుంది. ప్రక్కనే కూర్చున్నారు భర్త. కడుపులో బెంగగావుంది. ఏం మాట్లాడాలో తెలియలేదు సుశీలాంబకు. 'అయితే రోజువిడిచి రోజూ వుత్తరం వ్రాస్తారుకదూ' అంది చివరికి. సుశీలాంబ జడలో పువ్వులుసద్దుతో 'ఓ ఓ, రోజువిడవడం యెందుకు? రోజూవ్రాస్తాను. ఆఫీసు డ్యూటీ అవగానే నీడ్యూటీ పెట్టుకుంటాను. సరేనా' అన్నారు ఆయన నవ్వుతో. 'అబ్బానిజంగా వ్రాయాలిసుమండీ; నవ్వడంకాదు. 60 కవర్లుతెప్పించి కట్టకట్టి మీపెట్టిలో పెట్టాను' అంది. 'బాగానే వుందిగాని మరి 60 కల్లీలు కూడా కట్టియిస్తావేమిటి, సుసీ, మళ్లీయిబ్బంది అవుతుందేమో' అన్నారు ఆయన ఆమెముఖం తనముఖంవేపుకి తిప్పుకుని.

తెల్లారింది. కారువచ్చి మూర్తిగారి వాకిట్లో ఆగింది. నౌకర్లు సామానులు పట్టుకెళ్లి కారులో పెట్టారు. పిల్లలదగ్గిర శలవుపుచ్చుకున్నాడు. 'వెళ్లివస్తా సుసీ జాగ్రత్త' అనిమాత్రం అనగలిగాడు. ఆయన కారులోకూర్చోగానే వేగంగాపరుగెత్తి అదృశ్యం అయిందికారు. కారువెళ్లినవేపే చూస్తూ ఆలోచిస్తూ అల్లాగే అరగంట నుంచుని వుండిపోయింది సుశీలాంబ. చంటిపిల్లవాడి యేడుపు వినపడడంవల్ల యింట్లోకి వెళ్ళక తప్పిందికాదు.

*  *  *

మూర్తిగారు బెంగుళూరులో హోటల్లో ఒకగదిలో ప్రవేశించారు. ఇది చాలచిన్నహోటలు. సుమారు పది పదిహేను కుటుంబాలకి మాత్రం చోటువుంటుంది. కాని ఎందువల్లనో యిప్పుడు ఖాళీగానేవుంది. హోటలులో దిగినవాళ్ళందరికి భోజనానికి ఒక పెద్దహాలువుంది. అక్కడ బల్లలు కుర్చీలు వగైరా అన్నిపరికరాలున్నాయి. భోజనంవేళ అవగానే గంటకొడతారు. అందరు హాలులోకి వెళ్లి భోజనం చెయ్యాలి. మూర్తిగారు స్నానం మొదలయిన తమపనులన్నీ తీర్చుకుని, భోజనం టయిము అవడంవల్ల హాలులోకి వెళ్లారు. అప్పటికే ఒకబల్లదగ్గిర రెండు కుర్చీలమీద యిద్దరు భోజనానికి కూర్చున్నారు. దంపతులేమో! వేరేయింకొక బల్లదగ్గిర తనకి యేర్పాటు చేసిన కుర్చీమీద కూర్చుని ముందుచెయ్యవలసిన ఆఫీసుపనులనూ, ఇల్లువెతుక్కోడం గురించీ ఆలోచించుకుంటూ భోజనం ముగించుకుని గదిలోకి వచ్చేశారు మూర్తిగారు. రాత్రేసుశీలాంబకు తనుక్షేమంగా చేరినట్లు వుత్తరంవ్రాసి పోష్టులోవేశారు.

మూర్తిగారు మరునాడు భోజనానికి వెళ్లినప్పుడు కూడా ఆదంపతులు వచ్చారు. మొదటి రోజు మూర్తిగారు వీరిని అంతగా చూడలేదు గాని ఇవాళచూశారు. ఆ అమ్మాయి చాలా అందగత్తె. సుమారు 18 సంవత్సరాలుంటాయి. మర్యాదకుటుంబంలోనుంచివచ్చిన పిల్లలాకనపడుతోంది. ఏకులమోకాని బ్రాహ్మణులు మాత్రం కారనితోచింది. ఆమె నేత్రాలలో భయమూ, అసంతృప్తి తాండవం ఆడుతూన్నట్టున్నాయి. ఆమెభర్త బలహీనంగానూ అనారోగ్యంగానూ వున్నట్టు కనపడతాడు. అందమైనవాడేగాని మాటల్లో నాగరికత తక్కువగా కనబడుతుంది. అసలు ఆఅమ్మాయి అసంతృప్తికి కారణం యిదేనేమో. ఏమిభగవంతుని ఏర్పాటు; ఆ అమ్మాయికి ఆ అనారోగ్య వంతుడా భర్త? అనిపించింది. ఎన్నివున్నా ఏదో లోటు చూపిస్తాడు.

పదిరోజులు గడిచిపోయాయి. మూర్తిగారికి యిల్లుదొరకనేలేదు. వెతికి వెతికి చివరకిప్రాణం విసిగి ఆప్రయత్నం మానేసి యీరెండునెల్లూ హోటల్లోనే గడపడానికి యేర్పాటుచేసుకున్నారు. ఆప్రక్క గదిలోవాళ్లు కూడా అక్కడే ఉన్నారు. వారికీ యిల్లుదొరకలేదేమో? అసలువాళ్లు ఏమిపనిమీద వచ్చారో?

ఆయనపగలు మూడుగంటలదాకా యింట్లోనే ఉండేవాడు. ఆతరువాత ఎక్కడికోవెళ్లి ఎప్పుడో వచ్చేవాడు. బహుశా యీవూరు గాలికోసం వచ్చారేమో.

ఆరోజు ఆదివారం. మూర్తిగారు గదిలోనే వున్నారు. తాంబూలం నములుతూ పడకకుర్చీలో ఆలోచిస్తూ పడుకునివున్నారు. ఆహోటల్లోగదులన్నీ వరుసగావున్నాయి. ముందర స్థలం అంతావిశాలమైన వరండా ఉంది. ఆవరండాలో కూడా కుర్చీలువున్నాయి. సాయంత్రమప్పుడు చల్లగాలికి కూర్చోడానికి వీలుగాఉంది. ప్రక్కగదిలో అమ్మాయి వరండాలోకివచ్చి 'పనిచేసేకుర్రాడు మంచినీళ్లు పెట్టడం మరిచిపోయాడు; మీకూజాలో కొంచం నీళ్లువున్నాయాండి' అని అడిగింది మూర్తిగారిని. మూర్తిగారులేచి 'అవును; వెధవలు పనిసరిగ్గాచెయ్యరు' అని అంటో ఒకగ్లాసెడు కూజాలో నీళ్లు యిచ్చారు. నీళ్లుతీసుకుని కృతజ్ఞత తెలుపుతూ వెళ్లిపోయింది ఆ అమ్మాయి. మరునాడు మధ్యాహ్నం భోజనం సమయంలో మూర్తిగారిని చూపెట్టి నిన్నటి మంచినీళ్లవిషయం చెప్పింది భర్తతో. అదిమొదలు వీరికి వారికి పరిచయం మొదలెట్టింది. వరండాలో కనపడ్డప్పుడల్లా బాతాఖానీ వేసుకుంటూండేవాళ్లు. ఒకరిగదిలోకి యింకొకరు వెడుతుండేవారు. యీవిధంగా బాగాపరిచయం అయింది.

ఆరోజు మూర్తిగారు ఆఫీసునుంచివచ్చి కాఫీమాత్రం గదిలోకి తెప్పించుకున్నారు. తలనొప్పిగా వుందని ఫలహారం చెయ్యలేదు. మామూలుప్రకారం మూర్తిగారు హాల్లోకి ఎందుకు రాలేదని వెంటనే వచ్చింది ఆ అమ్మాయి. ఆమెపేరు కమల. కూర్చోండి కమలమ్మగారూ అనికుర్చీచూపించారు మూర్తిగారు. కమల కూర్చుంటో 'మీకంటే నేనుచాలాచిన్నదాన్ని; అంత ఎక్కువగా మన్నిస్తే నాకుచిన్నతనంగాఉంది. ఇప్పటినుంచి నన్నుకమల అనిపిలిస్తే సంతోషిస్తాను' అందినవ్వుతో. 'మిమ్మలిని చిన్నపుచ్చడం నావుద్దేశం కాదు. మీరుచెప్పినట్లే పిలుస్తాను' అన్నారు మూర్తిగారు కూడా నవ్వుతో. 'మీరు ఫలహారానికి హాల్లోకి ఎందుకురాలేదు. ఇవాళ నేను ఒకర్తినే వెళ్లాను. తినాలనే లేకపోయింది. కాఫీమాత్రం తాగి యిల్లా వచ్చాను' అందికమల. 'అల్లాగా మీభర్తగారు అప్పుడే వెళ్లారు యివాళ?' అన్నారు మూర్తిగారు. ఆమాటకు ఆవిడ వులిక్కిపడ్డట్టు కనిపించింది, క్షణకాలం తలవంచుకుని ఏదో ఆలోచించి చివరకి కొంచం హీనస్వరంగా 'ఆయన నాభర్తకారు. నేను అవివాహితను' అంది. 'ఆ! ఆయనే మీభర్తకారూ? క్షమించండి. పొరపాటు పడ్డాను' అన్నారు మూర్తిగారు. ఇలామాట్లాడుతో వుంటోనే ఒకబండివచ్చి గుమ్మంలో ఆగింది. ఇదివరకు కమల భర్త అనుకున్న ఆయన పేరుదాసుగారు. దాసుగారు ఆబండిలో స్పృహతప్పి పడుకుని వున్నారు. నౌకర్లు ఆయన్ని చేతులమీద తీసుకువచ్చి వారిగదిలో పడుకోపెట్టారు. కమల మొఖం అసహ్యంచేత వంచుకుని మూర్తిగారి గదివదలి తనగదిలోకి వెళ్లిపోయింది.

* * *

అప్పుడే మూర్తిగారువెళ్లి ఒకనెలయింది. సుశీలాంబకి ఒకదినం ఒకయుగంలా కనపడుతోంది. ఆరోజురాత్రి 9 గంటల సమయంలో డాబామీద పడకకుర్చీ వేసుకుని కూర్చుని ఆలోచిస్తోంది సుశీలాంబ. పిల్లలు యిద్దరు నిద్రపోతున్నారు. నౌకర్లు పనిముగించుకుని వెళ్ళిపోయారు. నిశ్శబ్దమైన నిరాటంకమైన సమయంలో ఆమె అల్లా ఎంతసేపు ఆలోచిస్తోందోకాని అచల్లగాలిలో కూడా ఆమెకు ముచ్చెమటలు పోశాయి. ఇంకా యీవిధంగా తలపోస్తోంది '20 రోజులదాకా ప్రతిరోజూవుత్తరం వ్రాశారు. ఆతరువాత యీపదిరోజులనుంచీ వ్రాసినఉత్తరాలు అంతశ్రద్ధగా కనపడవు; నాలుగురోజులకి వ్రాసినట్లు, ఏదోక్షేమం వ్రాసినట్టూవున్నాయి. కారణం యేమయివుంటుంది? పనిఎక్కువ అయిందోయేమో, పైగా వుత్తరంవచ్చి యేనాలుగురోజులో అయింది. భోజనసదుపాయంలేక యేఅనారోగ్యమో పట్టుకోలేదుకదా అని భయంవేసింది. కాని మొన్నవ్రాసిన ఉత్తరంలో పనితొందరలో ఉన్నట్టున్నా, ఆరోగ్యంగావున్నట్లు వుందికదా? ఎంతపనైనా 5 గంటలతోటే ఆఖరవుతుంది. నిజంగా పనివున్నా తనదినచర్యలో యిదొక పనిగా పెట్టుకుని మానకుండా వుత్తరం వ్రాసేవారికి తేడారావడానికి తగినంత కారణం వుండితీరాలని యీవిధంగా ఆలోచిస్తూ చంటికుర్రాడు ఏడుపువిని గదిలోపలకెళ్ళి నిద్రపోయింది. (సశేషము)

# బిడ్డకు తల్లి పాలయొక్క అవశ్యత

శ్రీమతి పి. జె. శాంతమ్మ గారు.

"స్త్రీ మాతృదేవత" అన్నారు. ఎంత గొప్పమేధానిధియైనను, దేశోద్ధారకుడైనను, విజ్ఞాన సమేతుడైనను తల్లి గర్భములో తొమ్మిది మాసములు ఈదులాడవలయును. తొమ్మిది మాసములు మోసి ప్రసవవేదనపడి తల్లి బిడ్డను కనును. తొలి నాలుగైదు గంటల వరకు బిడ్డకు ఎట్టియాహారమును ఇవ్వనక్కరలేదు. అందుకుకూడా ఆరోగ్య సంబంధమైన సృష్టి ఏర్పాటైయున్నది; అనగా అలిసినతల్లి, బిడ్డకు పాలీడరాదు. బిడ్డనోటిలోనుండి ద్రవము కారును. అది పూర్తిగా బయటబడినగాని బిడ్డ ఆరోగ్యమునకు భంగముకలుగును. కొంతమంది బిడ్డలకు జిగురువంటి ద్రవము పొంతులమూలమున ప్రవహించును. అటుల నోటినుండి ద్రవము పోయినబిడ్డ సులువుగా ఏడ్చుటకు, ఊపిరిపీల్చుటకు, ఊపిరితిత్తులు వాని పని సులువుగా జేయుటకును అవకాశము ఏర్పడును. ఆతరువాత అనగా సుమారు 6 గం॥ తరువాత తల్లిచనుబాలు ఇచ్చినచో అప్పటికి తయారైయుండిన జిగురుపాలు బిడ్డకడుపులో మోతాదు ప్రకారముగానే ప్రవేశించి బిడ్డ కడుపులోనున్న "ముర్రు" విరేచనములో పడిపోవును. సాధారణముగా జరిగే రీతి సృష్టిలోనే ఏర్పాటైయుండెను. అయితే, మనలో కొంతమంది చదువుకొన్న వారైనను, పైస్త్రీలయొక్క చనుబాలు తెచ్చి బిడ్డకు పురిటిలో పోయుదురు. అందువలన బిడ్డకు ఆరోగ్యము చెడిపోవును. పురిటాలు రెండుదినములు తనలో ఊరుచున్న జిగురుపాలను బిడ్డకిచ్చిన ఎంత ఆరోగ్యమో ఎరుగక అట్లు చేయుదురు. సరే జరిగినదేమో జరిగిపోయె ననుకొందము. ఇక ముఖ్య విషయము తల్లితనపాలు ఇవ్వకుండా ఆవుపాలో, లేక డబ్బాపాలో బిడ్డలకు అలవాటు చేయుట. నేను స్వయముగా కొంతమంది స్త్రీలను ఈవిషయమై ప్రశ్నించగావారు ఇచ్చిన జవాబులు వ్రాస్తాను; చదవండి.

"అబ్బా! అవయవములు అందవికారము దాల్చునండీ!"

"గుండెలో నొప్పి వస్తుందండీ"

"సిగ్గు వేస్తుందండీ"

"పాలు కొనుక్కోడానికి శక్తిలేనివారు తమపాలు ఇస్తారుగాని వాడు తాగే పాలు కొనశక్తిలేకనా, నాపాలు ఇచ్చుట"

"అబ్బా అలవాటుచేస్తే మాన్పుకోడం కష్టం"

ఇంకను కొంతమంది మాటలు మరచిపోతిని. ఇట్లాంటి అభిప్రాయములు తల్లికిగలిగిన ఆమె మాతృత్వము ఎట్లుకొనసాగును? స్వాభావికముగా దైవముచేసిన

ఏర్పాటువలన తల్లికి మూడుమాసముల గర్భమునిండగానే ఆమె స్తనములలో పాలు తయారగుటకు ప్రారంభించును. బిడ్డపుట్టిన తరువాత బిడ్డకు ఆపాలు త్రాగుటకు అవకాశము ఇయ్యవలయును. ఒకానొకతల్లికి ఏదో ప్రబలకారణమువల్ల పాలుపడవుగాని ప్రతితల్లికి పాలు స్వాభావికముగా నుండును. అట్టి మాతలు తమబిడ్డలకు పాలుపొంగార కడుపునిండుగనిచ్చి ఆ యానందము అనుభవింప జాలరుగదా మరియు బిడ్డకు పాలియ్యని తల్లిత్వరలో గర్భవతియగును. ఇకబిడ్డకు ఏడాదినిండకముందే మరియొకబిడ్డతయారు. నాయనుభవములో తనపాలిచ్చి పెంచినతల్లికున్నంత మమకారము పైపాలుబట్టుతల్లికి తన బిడ్డపైనుండదు. బిడ్డతలపునకు రాగానే తల్లిపాలు చేపులువచ్చును. ఆసంబంధమును కవులు అనేకరీతుల వర్ణింతురు. అట్టి సంబంధములేనప్పుడు బిడ్డఎవరి దగ్గరనున్నను తల్లికినిర్భయమే. లేనియెడల "నాబిడ్డ పాలకేడ్చునమ్మా; బిడ్డకు పాలవేళైనది; పాలుచేపులు వస్తున్నవి; నాబిడ్డ ఎట్లాఉందో" ఇట్టిమమకారము హెచ్చు. అయితే పాలుఇయ్యని తల్లికి బిడ్డపైప్రేమ లేదనను, గాని మొదటిరకపు ప్రేమకన్న తక్కువ; అనగా సెకండ్‌క్లాస్‌ప్రేమ.

కాన ప్రియసోదరీ మణులారా! మనముకనిన బిడ్డలకు మనపాలుఇచ్చి చాలనియడల బిడ్డకు పోయు ఆవుపాలు మనమేత్రాగి ఎటులో బిడ్డకు మనపాలు ఇచ్చుచున్న, మనయెడలపూచీ బెట్టబడిన మాతృనామము సార్థకముజేసు కొనగలము తల్లిపాలులేని బిడ్డలకు పెద్దకడుపులు పెరుగుట, తృప్తితీరకుండుట, ఎముకలలో కాల్షియం చేరకుండుటచే త్వరలో నడువలేకపోవుట అజీర్తి, గ్రహణి మొదలగు జబ్బులుకలిగి బాధనొందుట మొదలగుబాధలు కలుగును. ఇట్లాంటి బాధలలో చిక్కక ఆరోగ్యముగాను, బలముగాను, అవయవనిర్మాణము అందముగా నుండునట్లుగను, చూచుకొని దేశమునకు సేవ జేయునట్టి ఉత్సాహపూరితులనుగా జేయవలయునని నాప్రార్థన.



# రీటా తలవెండ్రుకలను పెంచును

రీటా కుదుళ్ళకు బలమునిచ్చి నిగనిగలాడు నిడుపాటివెండ్రుకలను పెంచుటకు అద్భుతమైన హెయిర్ టానిక్. తలవెండ్రుకలు రాలుట, నెరయుట, చుండ్రు, బట్టతల, పేనుకొరుకు ఇంకను తలవెండ్రుకలకు సంబంధించిన సమస్తవ్యాధులకు రీటా అమోఘముగ పనిచేయును. వేనకువేలు వాడి గుణమును పొందియున్నారు. మీరుకూడా నేటినుండియే రీటా వాడుడు.

## హిందీ, ఆంధ్ర, తమిళ, కన్నడతారల ప్రశంసలు

**లలితాపావర్ :** ఉత్తమమైన హెయిర్ టానిక్ కోరేవారికి రీటాకు మించినది మరేదీలేదు. దానిని వాడితే వారు మనమాతృభూమి అనేక శ్రేష్ఠమైన వస్తువులను ఉత్పత్తి చేయగలదని గ్రహించుకోగలుగుతారు.

**సుశీల్ కుమార్ :** రీటా శిరోజాల వృద్ధికి మిక్కిలి సంతృప్తికరమైన సాధనం. శిరోజాలు రాలిపోతున్నపుడు నివారణకు, బుద్ధినైర్మల్యానికి ఎల్లరూ ఎప్పుడూ రీటానే వాడాలని సిఫారసు చేస్తున్నాను.

**కన్నాంబ :** రీటా నాకు పరిపూర్ణమైన తృప్తికలిగించినదని తెలుపుటకు మిక్కిలి సంతోషముగానున్నది. అది నిజముగా అమోఘమైనది.

**పుష్పవల్లి :** నాకు సుమారు ఏడాదిగా తలవెంట్రుకలు రాలిపోతున్నవి. రీటా వాడినప్పటినుండియు, తలవెంట్రుకలు రాలుట తగ్గింది. ఇది చాల శ్రేష్ఠమైన హెయిర్ టానిక్ అని నా అభిప్రాయము.

**సూర్యకుమారి:** రీటా మంచి సువాసనకలిగి, వాడినవారికి ఎంతో చల్లదనము చేకూర్చును. ఇకమీదట ఎల్లప్పుడు రీటానే వాడవలయునని నేను ఒక నిశ్చయమునకు వచ్చితిని.

**కృష్ణవేణి:** రీటా చక్కని సువాసనగలిగి, మనస్సునకు ఆహ్లాదాన్ని కలిగిస్తుంది. తలవెంట్రుకలను రాలకుండాచేసి, కొత్త వెంట్రుకలను పెంచుటకు రీటా సాటిలేని హెయిర్ టానిక్.

**ఆర్. పద్మ:** నా ముఖసౌందర్యమును పెంపొందించే శిరోజాలకు రీటాయే కారణము. స్వల్పకాలములోనే రీటా అద్భుతముగ గుణము నిచ్చినది.

**లక్ష్మీబాయి:** తలవెండ్రుకలను పెంచుటకు రీటా అమోఘముగ పనిచేసినది.

**వసుంధరాదేవి:** శిరోజాలు దీర్ఘంగా నిగనిగలాడుతూ ఎదగడానికి, శిరోజరక్షణకు రీటా అమోఘమైనదిగ రుజువైనది.

**రాజమ్మ :** శిరోజ సంబంధమైన బాధల నివారణకు రీటా అమోఘమైనది. గుర్తించుచున్నాను. శిరోజవృద్ధికి, రక్షణకు ముఖ్యమైన వస్తువులు రీటాలోవున్నవి. దీర్ఘవినీలకుంతలాలు ఆశించే మహిళలందరూ దీనినే వాడాలి.

# రీటా హెయిర్ టానిక్

# నా చిన్ననాటి ముచ్చట్లు

డా॥ కే. ఎన్. కేసరి

## గయా క్షేత్రము

అంత శివక్షేత్రమునుండి ఈ విష్ణుక్షేత్రమునకు వచ్చితిమి. ఈ క్షేత్రమునకు పేరు విష్ణుగయ. ఇక్కడపారు నది ఫల్గుణీనది. ఈనదిలో జలము ఎడతెగక పారుటలేదు. అక్కడక్కడ చలములను త్రవ్వుకొని జనులు స్నానమును చేయుదురు. గంగాస్నానమునుచేసిన, పిమ్మట ఈ ఫల్గుణీ నదిలో స్నానమును చేసినవారి మనసు యెటులుండునో పాఠకులు గ్రహించుదురుగాక. అయితే ఈఫల్గుణీనది శ్రీరామచంద్రాదులు స్నానముచేసి పిండపితృతర్పణములను చేసిన పుణ్యతీర్థము గనుక దీనిని పవిత్రముగ నెంచెదరు. ఇక్కడికి పోయిన వారు మొదట ఈనదిలో స్నానమాచరించి పితృదేవతలకు పిండమును పెట్టెదరు. ఈపిండమును పెట్టుసమయమున మాతాపితృదేవతలనేగాక బంధుమిత్రాదులనుకూడ దలచుకొని తర్పణమును విడుచునప్పుడు మనసునకు కలుగు విచారమును వర్ణించుటకు సాధ్యముకాదు. అప్పుడక్కడ పూర్వపరిచితులను తలచుకొన్నప్పుడు ఆనందము, దుఃఖము పెనగొని బాష్పములు జలజల రాలుచుండెను. అంతరాత్మ అనేకగతుల సంచరించుచుండెను. అవతార పురుషులగు శ్రీరామ, శ్రీకృష్ణాదులను అక్కడ ధ్యానించునపుడు పురాణకాలము జ్ఞాపకమునకువచ్చి నాకుకల్గిన ఆనందమునకు మేరలేకుండెను.

## విష్ణుపాదము

ఫల్గుణీ నదీ తీరమున జరిపిన కర్మకాండానంతరము విష్ణుపాదమునందు రెండవసారి పితృ దేవతలను దలచుకొని పిండ పితృ తర్పణములను జరుప వలయును. శ్రీమహావిష్ణుని పాదస్పర్శనము సోకిన స్థళ మిదియని స్థళపురాణమున గలదు. అనేక సంవత్సరములుగ అనేకులు ఈ పురాతన పుణ్య స్థళమునకు వచ్చి పితృ దేవతలను తలంచుకొని కృతార్థులయిరి. వంగదేశమున వైష్ణవ మతస్థాపకుడైన శ్రీకృష్ణ చైతన్యుడు ఈ విష్ణు పాదదర్శనమును చేయకమునుపు నాస్తికుడుగ నుండెను. ఈ విష్ణు పాదదర్శనమే వీరిని నిర్వికల్పమైన విష్ణుభక్తునిగ చేసినది. పిమ్మటనే వంగదేశ మంతటను వీరి ఉపదేశమున కోటాన కోట్ల జనులు కృష్ణభక్తులయిరి. మేము ఈ విష్ణుపాదములను దర్శించునపుడు మా మనసంతయు ఆ విష్ణుమూర్తియందే కేంద్రీకరణమై చైతన్యుల మైతిమి.

## అక్షయవట శ్రాద్ధం

మూడవసారి శ్రాద్ధము చేయవలసిన స్థలము 'అక్షయవట'మను వటవృక్షముక్రింద. ఇక్కడనే కడపట శ్రాద్ధమును పెట్టి గయాక్షేత్ర యాత్ర ముగించుకొనవలయును. ఇక్కడ మేము గయావళుల చేతులలో చిక్కితిమి. యమధర్మరాజు భటుల చేతనుండి తప్పించుకొనుట సులభముగాని ఈ గయావళుల చేతినుండి తప్పించుకొని బయట బడుట అంత సులభముకాదని నాకు తోచినది.

వీరు నీతినియమము లేక తరతరములుగ యాత్రికులను బాధించి సంపాదించిన ధనమదాంధులు. వీరు నివసించు భవనములు ఆకసము నంటుచుండును. వేళ్లనిండుగ వజ్రపుటుంగరములను, మెడనిండుగ నవరత్నమాలలను ధరించుకొని పట్టుపరుపుల మీద పరుండి హుక్కాను పీల్చుచుందురు. వీరి గుమాస్తాలు వచ్చి వీరి దర్శనమును చేయించుదురు. వారు పంపిన గుమాస్తాలే మా కర్మకాండను ముగించెదరు. ఈ పెద్ద గయావళీలు కోటీశ్వరులుగ కూడనున్నారు. రాజాధిరాజులు యిక్కడికి వచ్చినప్పుడు శ్రాద్ధ సమయమున పెద్దగయావళులు ఏనుగమీద నెక్కి వచ్చి ఆ ధనవంతులను పీడించి ధనమును సంపాదించుదురు. వటవృక్షము క్రింద శ్రాద్ధమును పెట్టిన కర్తలను ప్రమాణపూర్వకముగనే యింతకు పైన దక్షిణ యివ్వజాలనని చెప్పించెదరు. అట్లు చెప్పిన పిమ్మటనే గయావళులు "గయాశ్రాద్ధ ఫలితమస్తు" అని మనవీపున చెందనపు చేతితో గట్టిగ కొట్టెదరు. మనము ఆదెబ్బను తిన్న పిమ్మటనే మనపితృదేవతలు స్వర్గమునకు పోయెదరు. అయితే ఈ గయావళీలు మాత్రము నరకమునకే పోదురని నా అభిప్రాయము. వీరనుభవించు రోగములను చూచితిని. వీరుచేయు అన్యాయములను చూచితిని. వీరివంటినిండుగ నవరత్నాభరణములు వ్రేలాడుచుండినను, ముఖమున ప్రేతకళలు తాండవమాడుచుండెను.

అట్టిపురాతన పుణ్యభూమియందు వీరు చేయుచున్న దురాగతములను దేవుడెట్లు సహించుచున్నాడో తెలియదు.

ఆ మహాపుణ్యక్షేత్రమగు కాశీపట్టణమందుకూడ ఒకభాగమున పాపక్షేత్రముండినటులనే ఇక్కడ కూడ గయావళీల బృందముకలదు. వెలుతురు చీకటి వెంట వెంట యుండినటులనే పుణ్యపాపములు కూడియుండును.

గయలోని గయావళులు మాకెదురువచ్చి మమ్ములను ఒక చీకటియింటిలోనికి తీసుకొనిపోయిరి.

అప్పుడు నాకు "కలకత్తాయందలి చీకటిగది" (Black hole of calcutta)కథ జ్ఞాపకమునకువచ్చెను. ఆయిల్లు చీకటిగనుండుటయేగాక చాల అసహ్యముగ నుండెను. ఆనాడు మేము పెట్టవలసిన గయాశ్రాద్ధమును ఒకహోటలులో యేర్పాటుచేసిరి. అక్కడికిపోయిన వారందరము 10 గంటలకు హోటలుకుపోతిమి. మేము అక్కడికిపోవునప్పుడు మరికొన్ని శ్రాద్ధములు ఉమ్మడిగ జరుగుచుండెను. మమ్ములనుకూడ వారిప్రక్కనే కూర్చుండుమనిరి. అదివరకు ఉపయోగించిన పవిత్రములను మాకు తలావకటి పంచియిచ్చిరి. వార్లదేశపు మంత్రములను ప్రారంభించిరి. ఉమ్మడి మంత్రతంత్రములు ముగిసినవి. మేము ముగ్గురము గనుక ఆరుగురు బ్రాహ్మణులు త్రేపుతు ఆకుల ముందరవచ్చి కూర్చుండిరి. వీరందరు ఇంతకుముందే యిక్కడ జర్గిన శ్రాద్ధములకు నిమంత్రణచేసిన బ్రాహ్మణోత్తములు. వార్లతోకూడ భుజించుటకు వారిప్రక్కననే మాకును ఆకులువేసిరి. ఆకులలో పసుపుకలిపినఅన్నమును పాయసమునుమాత్రమే మేము గుర్తించగల్గితిమి. కడపటవేసిన గడ్డపెరుగు బాగుండెను. గయాశ్రాద్ధ బ్రాహ్మణులు వండి వడ్డించినవాటిని రుచిచూచిరి. అందరము ఒకేకడవ లేచి వటవృక్షముక్రిందికి పరుగెత్తితిమి. అక్కడివారికి ఒంటినిండుగ గంధమును పూసి పూజించి దక్షిణ ఇవ్వవలయును. పితృదేవతలను తలచుకోవలయును. కర్మకర్తలు ప్రమాణ పూర్వకముగ నేను యింతమాత్రమే దక్షిణ యివ్వగలనని చెప్పవలయును. అప్పుడు నాకు "ప్రాణవిత్త మానభంగంబులందు" బొంకవచ్చుననే పద్యము జ్ఞాపకమునకు వచ్చి నాకిష్టమువచ్చినంత దక్షిణ యిచ్చి వారు వీపున కొట్టిన దెబ్బనో తిని యమధర్మరాజు భటులవద్దనుండి తప్పించుకొనగల్గితిని. ఈ సమయమున వారివారికి ప్రీతికరములైన ఆహారపదార్థములలో దేనినైనను ఒకదానిని వర్జించునట్లు ప్రమాణమును చేయవలయును. నేను నాభార్య పనసకాయ కూరను విడిచిపెట్టితిమి. నాతోకూడ యుండిన నెల్లూరి విస్సాలక్ష్మి నరసయ్య వారిభార్య యిరువురు దేవదారు ఆకుకూరను విడిచిపెట్టిరి. చెంగయ్య పంతులుగారు మాత్రమేవచ్చిరి. గనుక వారు దానిమ్మపండును విడిచిపెట్టిరి.

## బుద్ధగయ

యీక్షేత్రము విష్ణుగయనుండి సుమారు 8మైళ్ల దూరముననున్నది. విష్ణుగయనుండి మేము ఇక్కడికి వచ్చి చేరితిమి. హిందువులకు కాశీక్షేత్రము యెంత పావనమైన స్థలమో ఈబుద్ధగయ బౌద్ధులకు అంత పావనమైనది. దీనిని బోధగయని కూడ పిలిచెదరు. ఇది శ్రీబుద్ధభగవానుడు జ్ఞానసిద్ధిని పొందిన స్థలము. పూర్వమున ఈ మహాబోధి యను ప్రసిద్ధిచెందిన వృక్షముక్రిందనే వీరు సిద్ధినిపొందిరి. ఆ మహాబోధి వృక్షము ఇప్పటికిని

ఇక్కడ వున్నది. అశోక చక్రవర్తి ఇక్కడికి వచ్చినట్లు శిలాశాసనములు యింకను యిక్కడనున్నవి. బుద్ధమత ప్రచారకోత్తముడును అద్వితీయ గుణసంపన్నుడును అగు ఆ చక్రవర్తి శిలావిగ్రహమును ఇక్కడ ప్రతిష్ఠింపబడియున్నది.

ఈ క్షేత్రమును దర్శించుటకు ఇప్పటికిని నానాదేశములనుండి జనులు వచ్చుచున్నారు. ప్రతిదినము యిక్కడ చైనా, జపాన్, సిలోన్, బర్మా మొదలగు దేశముల నుండి వచ్చువారిని చూడవచ్చును. "రాజగృహం" యను స్థానమునుండి బుద్ధుడు మతప్రచార ప్రారంభమును చేసినను ప్రపంచమునంతయు సూక్ష్మదృష్టితో చూచుచు సిద్ధిపొందిన స్థలమిది. ఈ పుణ్యప్రదేశం బౌద్ధులకేగాక సత్యమెరింగిన వారికందరికిని మహా పుణ్యభూమి యని చెప్పుటకు భేదాభిప్రాయము లుండవు. ఇప్పుడిక్కడయుండు బౌద్ధదేవాలయములలోని అర్చకులందరు హిందువులు. ఏలననగా-బుద్ధదేవుని శిష్యుల నందరిని శ్రీ శంకరాచార్యుల వారి శిష్యులు వాద ప్రతివాదములందు ఓడించిరి. అప్పటి నుండి హిందూమతస్థులే బౌద్ధాలయములను పాలించుచున్నారని ఇక్కడిస్థలపురాణము. ఈ క్షేత్రమును దర్శించి మేము తిరిగి విష్ణుగయకు వెళ్లితిమి.

## ప్రయాగ (అలహాబాదు)

మేము కాంగ్రెసుకు హాజరగుటకు మొదటనే ప్రయాగక్షేత్రమునకు పోతిమి. ఆయితే అసమయమున అక్కడ జనసమ్మర్దము అధికముగ నుండుటవల్లను మహాసభ హడావుడి అసౌకర్యము లధికముగ నుండినందునను తిరిగి వచ్చునప్పుడిక్కడ దిగి నిదానముగ స్థలమును చూడదలచుకొని కాశీకి వెళ్లితిమి.

ప్రయాగ మహాక్షేత్రమున మహనీయులెందరో పూర్వము యజ్ఞ యాగాదిక్రతువుల జరిపినందున ఈ క్షేత్రమునకు ప్రయాగ యనుపేరు కలిగినదట. ఇక్కడ గంగా యమునానదులు సరస్వతి అంతరవాహినిగా చేరి పారునట్టి కూడలి. ఈ కారణమున ఈ సంగమస్థానమునకు త్రివేణియను పేరుగల్గినది.

కాశీయాత్రకు వచ్చినవారు ముఖ్యముగ ఈ త్రివేణి సంగమము నుండియే గంగను తీసికొనిపోవుదురు. ఇక్కడ పారు జలమునకే అత్యంత మహాత్మ్యముండినటుల దెలిసికొనిరి. పాశ్చాత్య శాస్త్రవేత్తలుకూడ ఇక్కడి జలమును పలువిధములుగ పరీక్షించి ఈ జలమున రోగబీజముల నశింపజేయు శక్తిగలదని నిరూపించిరి. అందువల్ల ఈ జలమును పాత్రయందుంచి సీలుచేసిన యెన్నిసంవత్సరములైనను జలము చెడిపోక శుద్ధముగ నుండును. మరియు-ఈజలమును తామ్రపాత్రయందుంచుట మహావిశేషము. తామ్రమునకు

క్రిమికీటికాదులను నశింపజేయు శక్తిగలదు. ఈ కారణముననే మనపూజాపాత్రలను తామ్రముతో చేసిరి. వాటినే వాడుచుండు పూర్వీకుల ఆచారము యిప్పటికిని కలదు. రోగక్రిమి నాశనమునకు రాగితాయిత్తులనే బిడ్డలమెడలలోను మొలలకును కట్టుదురు. ఈ విధముగ హిందువులకు ఆరోగ్యసూత్రములతో కూడిన ఆచారము లెన్నియోకలవు.

త్రివేణి సంగమంమధ్యకు మేము పసుపు, కుంకుమ, పండ్లు రవిక మొదలగు వాయనపు సామానులను తీసికొని పడవనెక్కిపోతిమి. పురోహితుడుకూడయుండి మంత్ర తంత్రములను జరిపిరి. అలహాబాదు పరిశుభ్రమైన పట్టణముకాదు. సాధారణముగ గొప్ప క్షేత్రములన్నియుగూడ పరిశుభ్రముగనుండవు. ఈ పట్టణమున గొప్పగొప్ప భవనములతో లక్ష్మి తాండవమాడుచుండినను దరిద్రదేవత విచ్చలవిడిగ విహరించుచుండుట చూడవలసి వచ్చెను.

త్రివేణి సంగమ సమీపమున ఔరంగజీబు కోటయుండెను. ఇది పురాతన కట్టడమైనను అతిగంభీరముగనుండెను. ఈ కోట ముందు హిందువుల స్వాధీనమున యుండినట్లు ఆనవాలు కనుపడుచున్నవి. కోటలోపల హిందువుల దేవాలయములున్నవి. అక్షయ వటమను వటవృక్షము యిక్కడ కలదు. ఆవృక్షమును యిప్పటికిని హిందువులు భక్తి శ్రద్ధలతో పూజించుచున్నారు. ఈ వృక్షము ఔరంగజీబుకాలమునుండి వున్నట్లును, మరణానంతరము స్వర్గమునకు పోదలచుకొన్నవారు ఈ చెట్టుక్రొమ్మన ఉరిదీసుకొను న్యాయము ఆకాలమున నవాబులకును ఉండినట్లును ఇక్కడిస్థళపురాణము. ఈకోటలో యిప్పటికిని చిన్నచిన్న దేవాలయములు పవిత్రస్థళములున్నవి. ఔరంగజీబు హిందూ మతద్వేషి అయినను హిందువులు పూజించు స్థళములు యిక్కడ చెక్కుచెదరకుండ వుండుటకు కారణమేమో !





గోపిక

" మానినీ మదనుతో మాఁగాక యెఱిగించి
మాధవీ లతలార మనుపరమ్మ "

(భాగవతం. దశమస్కంధము.)

చిత్రలేఖనము : శ్రీమతి బొమ్మగంటి లలితాదేవిగారు.






## మామిడికాయ పచ్చళ్ల విధానము

ప్రతీ మే, జూన్, నెలలలో (అనగా) వైశాఖ, జేష్టమాసములలో మామిడికాయలు విరివిగావచ్చే సంగతి అందరకు తెలిసినవిషయమే. ఆమామిడికాయలను మనము అనేకరకములుగా వుపయోగించ వచ్చును. వాటివుపయోగము ఒకరోజు రెండురోజులు మాత్రమే కాక సంవత్సరమంతా మనకుసరిపడే విధముగాను రుచికరముగానుండేలాగు అనేకరకములుగా వాడవచ్చును. సర్వసాధారణముగా సోదరీమణులకు తెలిసిన విషయమే కావచ్చును. మరొకమారు నా అనుభవమునుబట్టి వ్రాయువిధమును, తెలిసిన వాటిని వదిలిపెట్టి తెలియని విషయము గ్రహించమని సోదరీమణులకు నాహెచ్చరిక. పచ్చళ్లటైము అయిపోవుచున్నందుకు ముందుగా పంపలేక పోయినందుకు విచారిస్తూ ఎప్పటికైనా తెలుసుకున్నది వృధాకాదనే వుద్దేశముతో వ్రాయ సాహసించుచుంటిని. మనము ఏపచ్చళ్లు అయినా పెట్టుకునే ప్రయత్నములో నుండగా, వాటి నిమిత్తము రాతిజాడీలుగాని, వుపయోగములో నుండేపాతకుండలుగాని పరిశుభ్రము గాకడిగి వారంరోజులు ముందుగా ఎండలో ఆరబెట్టవలెను. లేనిచో నిలవవుండే పచ్చళ్లుపాడు అవును. ముందుగావాటిని సిద్ధ పెట్టుకుని పచ్చళ్ళ ప్రయత్నము పెట్టుకొనవలెను.

**కుమ్ముపచ్చడి విధానము**—చెట్టునుండి (కోయించిన మామిడికాయలను, కొద్దిపరువుకు వచ్చినవైన చాలా బాగుండును.) పైచర్మము గీసివేసి, చిన్నముక్కలుగా తరిగి వుప్పు, పసుపు ముక్కల మధ్యమధ్య జల్లుతూ వూరపెట్టవలెను. ఆలాగు రెండురోజులు వాటిని కలియపెట్టవలెను. మూడవరోజున వాటిని వూటనుండితీసి, ఎండలో వేయవలెను. అదికూడ రెండురోజులు మాత్రమే ఎండపెట్ట వలెను. అప్పుడు పచ్చడిగా చేయవలెను. 50 కాయలకు కావలసిన సామగ్రి 1/2 వీశ ఎర్రమిర్చి, 1/2 శేరు ఆవాలు, 1/4 శేరు మెంతులు, 1/4 శేరు మినపపప్పు, 1/4 వీశ వెల్లుల్లి, యిష్టమును బట్టియింగువ, నువ్వుల నూనె 1 వీశ-ముందుగా యీపైన వ్రాసిన సామానులను కమ్మగా వేగనిచ్చి పొడిగా దంచవలెను. వెల్లుల్లి మినహా అంతాగుండచేసి, ముక్కలను కూడా మెత్తగా కుమ్మి, అంతా మొత్తముగా ముక్కల తాలూకు వూటలో కలుపవలెను, పైగాకొంతనూనెలో కరివేపాకు, వెల్లుల్లిరేకలు కొద్దిగా మిరపముక్కలు, ఆవాలు, మెంతులు పోగిచి పైనపోసి బాగాకలిపి మూతబిగించిన ఎంతకాలమైనా, ఎంతరుచికరముగానైనా వుండును. చేయిపెట్టకుండా గరిటెతో వుపయోగించుకున్న సంవత్సరమంతా వుండును. ఆవూటకూర వండుకొనకపోయినా బాధవుండదు. నోటికి హితవు పుట్టును.

**ముక్కల వూరగాయ పెట్టేవిధానము:-** కండగల మామిడికాయలను బాగుగా కడిగి, టెంకతోసహా ముక్కలుగా కొట్టించి జీడితీసి ముక్కలు శుభ్రము చేసుకొనవలెను. 50 కాయలు పెద్దవి అయిన, 2 శేర్ల కారముగుండ(పొడి), 2 శేర్ల ఆవగుండ, 2 శేర్ల వుప్పుగుండ, 2 వీశెల నువ్వులనూనెలో యీ గుండలుమూడు బాగుగాకలిపి 1/2 సోలెడు పసుపుగుండకూడా కలుపవలెను. అప్పుడు ముక్కలను యీకలిపి వుంచిన గుండలో పొడిపిజాడీలలో పెట్టవలెను. అల్లము చిన్నముక్కలుగా తరిగి వెయ్యవలెను. వెల్లుల్లి పాయలు రేకలుగావలిచి వేయవలెను. పైన 2 తులాలు ఏలక్కాయలు, 2 తులాలు లవంగాలు, 2 తులాలు దాచినచెక్క, మరిగిన నూనెలో వేగనిచ్చి పైనపోసి మూతపెట్టవలెను. 2 రోజులు బాగుగా గరిటెతో కలిపి

మూతి బిగించిన చాలారుచిగానుండును. తీపికావలసిన వారు 2 వీశల పాతబెల్లము మెత్తగా చిదకకొట్టి కలిపిన చాలా బాగుండును. కూరలు అవుసరములేకుండా కాలక్షేపము చెయ్యవచ్చును. కేంపులకు తిరిగే మగవారికి సీసాలలో పెట్టియిచ్చిన చాలా వుపయోగపడును.

మామిడికాయ ఉప్మా: ఇనకూడా చాలా రుచిగానుండును. కడిగి ఆరపెట్టినబియ్యమును సన్ననూకగావిసరి పిండిగగొట్టి, వేడినీళ్లతో నూకను వుడికించి పైనకొద్దిపసుపుగుండ, అల్లంముక్కలు, సపచ్చిమిరప ముక్కలు కరివేపాకు వేసి, కొద్దినూనెవేసి మూతపెట్టవలెను. మామిడికాయపైచర్మముగీసి ముక్కలుగా తరిగి రుబ్బురోటిలో ముద్దగారుబ్బి వుప్పకూడాచేర్చి వుడికివున్న నూకతో కలుపవలెను. మిరపకాయముక్కలు, మినపప్పు, ఆవాలు, మెంతులు నూనెలో వేగనిచ్చి, సిద్ధముగానున్న వుడికిన నూకతోచేర్చి, బాగుగా తిప్పిన చాలా రుచిగానుండును. ఎంతతిన్నా తినవలెననే వుండును.

పిల్లలయింట్లో పచ్చళ్లుముఖ్యముగా వుండవలెను. బిడ్డలకు అన్నహితవు పుట్టేగుణము, ఆరోగ్యము పాడు చేయని గుణము పచ్చళ్లలో వున్నది. ఇంకా అనేకరకములుగా పెట్టవచ్చును. శ్రమకు ఓర్చిన ఎన్నివిధముల నైనా చేయవచ్చును. ఆ బాధ్యత కుటుంబవిషయములో మనదై వున్నది. కాన నేనువేరుగా వ్రాయవలసిన జేమియులేదు. శెలవు.

కె. సత్యవతమ్మగారు.

నెల్లూరిబోండచేయువిధము:-1 పావు రవకు 6 పచ్చిమిరపకాయలు 1తులంఅల్లం సన్నముక్కలుగా తరిగిపెట్టవలయును. దానిలో కొంచెము కరేపాకువేయవలెను. పొయ్యిమీద బాణలివేసి 3పలముల నెయ్యివేసి కాగిన తర్వాత 1 ఎండుమిరపకాయ తుంచివేసి ½ చటాకు మినపప్పు ½ చటాకు ఆవాలు, 1 స్పూను శనగపప్పు, 1 పలం జీడిపప్పువేసి వేగిన తర్వాత తరిగిన ముక్కలువేసి 1¼ పావునీళ్లు పోయవలెను. దానిలో తగుమాత్రం వుప్పవేసి 2 తెర్లులు వచ్చిన తర్వాత రవపోసి బాగుగా కలియపెట్టి వుడికిన తర్వాత ఒకనిమ్మ పండుపిండి దించవలయును. అదిచల్లారిన తర్వాత చిన్నచిన్న వుండలుగాచేసి పెట్టుకొనవలయును. ఒక గిన్నెలో ½ పావు శెనగపిండి ¼ పావుపచ్చిపిండి 1 స్పూను నూరిన వుప్ప 1 స్పూను మిరపపొడివేసి నీళ్లు వేసి కొంచెము పలచనగా కలిపి 1 చిటికెడు సోడ వేయవలయును. బాణలిలో నెయ్యికాని లేక నూనె గాని పోసి కాగిన తర్వాత ఆవుండలను పిండిలోముంచివేసి ఎర్రగాకాగిన తర్వాత తీసితినిన యెడల కమ్మగా వుండును. ఇష్టమైతే ఎర్రగడ్డలు వేసుకోవచ్చును.

బర్ఫిచేయువిధము :- 1 టెంకాయ కొబ్బరి, నలుపురాకుండ తురిమిపెట్టి పొయ్యిమీద ఒక గిన్నెలో 1 చటాకు నీళ్లుపోసి అందులో కొంచెము నెయ్యివేసి 10 పలముల చక్కెరపోసి బాగుగా గరిటెతో కలియబెట్టవలెను. 3 తెర్లులు వచ్చిన తర్వాత కొబ్బరతురుము వేయవలయును. 1/2 గంట అయిన తర్వాత అదికొంచెము గట్టిపడును. దానిలో జీడిపప్పు సన్నగా తరిగి ముక్కలు నేతిలో వేయించి వేయవలెను. 6 ఏలక్కాయలు పొడికొట్టివేసి 1/2 నవటాకు పాలుపోసి బాగుగా గలియపెట్టుతు వుండవలయును. అది 5 నిమిషములకెల్ల కొంచెముగట్టిపడును. ఒకపళ్లెమును నెయ్యిరాచి దానిని పళ్లెములో పోయవలయును. కొంచెముచల్లారిన తర్వాత కత్తితో ముక్కలుగాకోసి తినిన యెడల చాల రుచిగావుండును.

శ్రీకంఠ శారదాంబ.

కజ్జికాయలు చేయువిధానము :- ఎండుకొబ్బరి చిప్పలు 1 వీశె, వేయించిన సెనగపప్పు 1 శేరు, పంచదార 2 వీశెలు, మైదాపిండి 1/2 వీశె, కొబ్బరి తురిమి రోటిలోవేసి దంచవలెను. సెనగపప్పు మెత్తగాదంచి జల్లిడిపట్టవలెను. ఒకవీశె పంచదార మెత్తగాదంచవలెను, దంచనిది ఒకవీశె పంచదార,

సెనగపిండి, కొబ్బరి, దంచిన పంచదార, జీడిపప్పు, యాలకులపొడిచేర్చి ఇవి అన్నియు కలపవలెను. మైదాపిండిలో చిటికెడు సోడాపుప్పు, నాలుగు మిల్లిగరిటెల కరగపెట్టిన నెయ్యివేసి అప్పడాలపిండి కలిపినట్లు కలపవలెను. కజ్జికాయలచెక్క చుట్టూరనెయ్యిగాని పిండిగాని రాయవలెను. మైదాపిండి అప్పడముచేసి చెక్కమీదవేసి దానికితగినంత పిండిచేర్చి అప్పడము చివరనీళ్లురాసి చెక్కనొత్తవలెను. తెల్లటివస్త్రము తడిపి గట్టిగాపిండవలెను, కజ్జికాయ ఆరకుండా పీటమీదపెట్టి తడివస్త్రము కప్పవలెను. బాణలిలో నెయ్యివేసి కరగపెట్టి కజ్జికాయ దానిలోవేసి వేయించి తీయవలెను. ఇవిచాలరుచిగా నుండును.

నాళం అలివేలుమంగతాయారమ్మ

ములగకాడలకూర :- ములగకాయలుతెచ్చి, వాటిలోపలి గుజ్జుతీసుకోనేది. కందిపప్పు పలుకు పదునుగా ఉడుకపెట్టి వేరువేరుగా ఉంచుకోనేది. పచ్చికొబ్బరి తురుము వేరుగా ఉంచుకోనేది పొయ్యిమీద బాణలి కాలనిచ్చి కొద్దిగానూనెవేసి, నాలుగుమిరపకాయలు చిన్నవిగా గిల్లి, కొద్దిగా మినపబేడలు, కొద్దిగా ఆవాలు అన్నియు కలిపి కాగిననూనెలోవేసి వేగనిచ్చి తురిమిన కొబ్బరివేసి తీసి ఉంచుకొన్న గుజ్జు, కందిపప్పువేసి దానికి మితముగా ఉప్పు, పసుపుపొడివేసి మూతపెట్టవలెను. 10 నిమిషముల తర్వాత మూతతీసి కలియపెట్టి మరల 10 నిముషములకు కలియపెట్టి దించి వేరే కళాయి గిన్నెలోకి తీసుకోనేది. ఈకూర అన్నములో కలుపుకోను బాగుగా ఉండును.

మామిడి అల్లం పచ్చడి :- మామిడి అల్లం బాగా కడిగి ముక్కలుగా తరిగిపెట్టుకోనేది. కొద్దిగా మిరపకాయలు, కొద్దిగా ఆవాలు, మెంతులు, ఇంగువ అన్నియు నూనెవేసి వేయించి ఉప్పు, కొద్దిగాచింతపండుపెట్టి ముక్కలు వాటితోకూడానే నూరవలెను. నూరి గిన్నెలో తీసుకొని వాడుకోనేది.

కాకాణి మీనాక్షిసుందరమ్మ




(1948 నవంబరు సంచికలో వివరింపబడిన శిశువ్యాధులకు సులభ చికిత్సలు.)

18. గవదబిళ్లలు :- వ్యాధి నిరోధకశక్తి తగ్గియుండు బాల బాలికల కందరికి శీతవాయువు వీచు హేమంతఋతువునందు వచ్చుచుండును. సామాన్యముగా కొందరు జాగ్రత్తగల తల్లులు ఉల్లుటోపీలు, ఫ్లానలు గుడ్డలు చెవులు, నడినెత్తి, మెడనరములు శీతవాయువులకు గురికాకుండ ముసుకులు అందముమీర వేయుచుందురేగాని మన దేశమున కుపకరింపవు ఇట్టి గవదబిళ్లలు కలిగినప్పుడు మెడనరములు, గొంతుక క్రింద, చెవిక్రింది భాగములు వాచును. వాపు ఎరుపుగానుండును. జ్వరముకూడ వచ్చును. ఆహారము పుచ్చుకొనుటకు సహితము కష్టముగా నుండును. ఇందులకెన్నియో సులభచికిత్సలు కలవుగాని సాధ్యమయి అందుబాటులోనున్న వానిని రెండు మూడింటిని మాత్రమే పేర్కొనబడును.

బాదముపప్పు 4-5 కాయలలోనిది తీసి మెత్తగా తేనెతో కలియనూరి Plaster మాదిరి సన్నని తెల్లనిగుడ్డ బిళ్లలకు సరిపోవునంత తీసికొని నూరగావచ్చిన దానిని గుడ్డపై అంటించి గవదబిళ్లలకు వేసిన నెమ్మదిగా నొప్పి నెమ్మదించి హాయినిచ్చును.

మరియొకటి :- అవిశెఆకు పసరుతీసి ఆ పసరులో కొంచెము సున్నము పసుపు వేసి కలిపి నొప్పిగలచోట రాయవలయును.

ఇంకొకటి :- సునిశితమైన శరీరచ్ఛాయ గలిగిన పిల్లలకు ఆముదపు గింజలలోని పప్పులను తీసి కొంచెముగా యింగువ చేర్చి కలియనూరవలయును. నొప్పిగలచోట రాయవలయును. ఇందులోవక వెల్లుల్లి జేర్చుటకూడ మంచిదేగాని చర్మము పొక్కకుండా స్వల్పముగా వేయవలయును.

19. స్వరపేటిక వాపులు :- గవదబిళ్లలు పైనను స్వరపేటిక వాపులు లోవైపులను కానుపించును. దీనికి అజీర్ణమే ముఖ్య కారణము. కఫముతోకూడని పొడిదగ్గుతో

ప్రారంభించును. క్షీణతగానుపించును. ఎప్పుడు వడి శెము పట్టినట్లేయుండును. బలహీనతకు యిది ముఖ్యలక్షణము. శరీరము ఎల్లప్పుడు వేడిగానుండును. మంచి ప్రాయమున సుమారు 12 సంవత్సరముల్లపు బడికిపోవు పిల్లలకు నిదియొక ఆటంకముగ వచ్చుచుండును. ఈ ప్రాయమున నే-ఆపరేషన్ చేయవలెనని భయమున హృదయమువేదనా యుతమగు మాటలతో డాక్టర్లు ముచ్చటలు సాగింతురు. ఈ గొంతుక భాగము జీవమునకు ముఖ్యమయినది. శస్త్ర చికిత్సకు దూరముచేసిన యీవ్యాధియే కానుపించదు. పేరుకూడ పెట్టరు. అనుభవములోనున్న అలవాటొకటి యీకాలములో వ్యాధులను పురికొల్పుచున్నది.

బాగుగ గమనించిన ప్రతి గృహలక్ష్మికూడ నిజమని యొప్పుకొనక తప్పదు. అందరు చల్లని, వేడిపానీయములకు అలవాటైయున్నారు. మొదట చన్నీరు త్రాగి (ice water) అటు పై వేడికాఫీగాని, టీగాని త్రాగెదరు. ఈ రెంటిని వకేపర్యాయము వకటివెనుక నొకటి త్రాగకల్గినను ఆరోగ్యమునకు భంగము. అందరికి కాదు. బలములేని పిల్లలకు టాన్సిల్స్ (Tonsils) అనువ్యాధి పీడించును.

ఇందులకు సులభచికిత్స :-

మిరియములు 1 తు
తాడికాయ, ఉశిరకకాయ, కరక్కాయ (త్రిఫల చూర్ణము) 1 తు
వెలిగారము పొంగించి జేసిన భస్మము 1 తు
అతిమధుర చూర్ణము 1 తు
మంచి తేనె 5 తు

ఈ అయిదింటిని తేనెతో బాగాకలియనూరి వక మూతివెడల్పాటి సీసాలోవేసి జాగ్రత్త చేసి వుంచుకొనవలయును. మెత్తనిదూదిని వక చీపురుపుల్ల చివరని (Swab) మాదిరిగ చేసి కొండనాలుక యిరువైపుల, పిల్లలనోరు తెరిపించి నెప్పగరాచిన అట్టిలోనున్న వాపులు నెమ్మదించును. ఏమియు వ్యతిరేకము చేయదు.

బలముగ నుండుటకు అశ్వగంధాది చూర్ణమును గుమ్మపాలతో యీ ప్రాయము గల పిల్లలకు యిచ్చుటమేలు.



# బ్రతుకు తెరువు

## కోటివిద్యలు కూటికొరకే

"లక్షాధికారైన లవణమన్నమె గాని
మెరుగు బంగారంబు మ్రింగబోడు."

కావున బ్రతుకు తెరువులలో చాలవరకు ఇందుకు సంబంధించినదై యుండును. నేడు పంటలు తగ్గుటచేత జనము వృద్ధిఅగుటచేత - ఆహారసమస్యయే ప్పడి మనజీవితములను నలిపివేయుచున్నవి. ముఖ్యము బియ్యమువండితిను మన ప్రాంతమువారిస్థితి మరీఘోరముగానున్నది. అసలే బియ్యము అంతగా బలకరము గాని ఆహారము. దానికితోడు దేశమునపాడియు మందగించినది. ఆ బియ్యమైనను చాలినంత సరఫరా యగుటలేదు. కావున ఈ సమస్య పరిపాలకులకు ఆలోచనీయమైనది. ఇటీవల భారతయూనియన్ ప్రధానమంత్రి, గవర్నర్ జనరలున్నూ - ఈ విషయమై రేడియోద్వారా ప్రజలతో ప్రస్తావించియున్నారు. అందులో శ్రీ రాజాజీగారు అన్నారుగదా. "నేను తెలుగుమీరి అందరున్నూ మెత్తటి వరిబువ్వే కోరుతున్నారు. అందుచే జనానికి చాలినంత వరిబియ్యము సప్లైచేయలేకున్నాము. ఇంతవరకు నాజూకుగాదనే భ్రమింపబడిన - జొన్నలు, రాగులు మున్నగు ముతకధాన్యములుతినుట నాజూకు, గౌరవము అనే భావము పెంపొందించవలెను."

నిజమే; కాని చిరకాలముగా బుద్ధిలో స్థిరమైయున్న భావమొక్కసారి పోజాలదు. ఏ నాగరికుడును రాగిసంకటినిగాని, జొన్నకాయలనుగాని వెండికంచములో పెట్టుకొని తినుటకు ఓర్వజాలడు. అది హాస్యాస్పదముకావచ్చు. అందుచే ఆ ముతక ధాన్యములనుతినుట, ఆహారసమస్యా పరిష్కారమునకు, దేశీయుల జవసత్వముల పెంపొందించుకొనుటకు అవసరమైనపుడు వాని నుపయోగించుటకు నాగరికమైన పద్ధతిని కనిపెట్టవలెను.

పాశ్చాత్య నాగరికతద్వారా కొన్నిటి నిట్టి వానిని నేర్చితిమి. తవుడు అరగదంచిన తెల్లని బియ్యపు అన్నమును బిడ్డలకుపెట్టుచు వారిచేతనే విదేశములనుండివచ్చు తవుడుబిస్కత్తులను తినుపించుచున్నాముగదా.

అట్లే రాగి జొన్న, సజ్జ, మొదలైన ముతుగు ధాన్యములను రూపుమార్చి అందమైన డబ్బాలలోపోసి ఉంచుకొని, పాలుచక్కెర చేర్చిన పానీయముగ తయారుచేసుకొని వెండిగిన్నెలలో నారగించుటకు నేర్చినాము. అయితే అక్కడ ఎక్కడనో, ఏ దేశముననో తయారై ముక్కిపోయి మనకెగుమతికాగా మనమారగించుటకన్న - మనదేశముననే మన ఇండ్లలోనే, తయారుచేసి మనమారగించవచ్చును. అందుచే విదేశములనుండి దిగుమతిఅగు, నిట్టి ఆహారములను కొనితినుట లోనగు అధికవ్యయము తగ్గును. మరియు తీరికలేకయో ఓపికలేకయో ఇట్టి వానిని చేసుకోలేనివారికి వీనినిచేసి విక్రయించుటవల్ల ధనమార్జించుట బ్రతుకుతెరువగును

ఈ ముతక ధాన్యమును నాజూకుగా తినుటకు రూపుమార్చిన యొకవిశేషమే - "మాల్టు." ఈ మాల్టును తయారుచేయుట అతిసులభమార్గము. జొన్న, రాగి, మొక్కజొన్న మొదలైన ముతక

(తరువాయి 418)

# ఇంటిపనులలో మెళుకువలు

  

శ్రీమతి అయ్యల సోమయాజుల భవానీగారు

పిల్లల్ని కనడంతోనే తల్లుల బాధ్యత తీరిపోలేదు. వారిని చక్కటి విధానముతో సరియైన దారిలోకి తీసుకురావడానికి ప్రతితల్లి ప్రయత్నంచేయాలి. అట్లు ప్రయత్నించడానికి తల్లులు విజ్ఞానవతులై యుండాలి. తల్లులంటే యెవరనుకుంటున్నారో ఓ సోదరీమణులారా మీరే. మనకు అట్టే చదువులు అవసరంలేకపోయినా మన మాతృభాషయినా మనకు రావాలంటారా? అక్కర్లేదా? భాషాపరిచయం కొంతవరకైనా ఉంటే గృహలక్ష్మి మొదలైన సంచికలద్వారా మనకు తెలియని విషయములు కొంతవరకూ తెలుసుకోడానికి అవకాశముంటుంది. ఎవరో అమ్మలక్కలు అంటారు లెండి తెలిసీ తెలియని జ్ఞానంతో, 'అరవయో యేట అగ్నిగండం అన్నట్లు నా కిప్పుడు చదువేమిటి నా బొంద' అని. అన్నట్లు మరిచేపోయాను. చదువుకున్న సోదరీమణులు కొందరున్నారుకదూ. పోనీ మీరైనా తప్పకుండా గృహలక్ష్మి చదివి చెప్పండీ. చెప్తారుకదూ.

పిల్లల్ని కనడంతోనే తల్లుల బాధ్యత తీరిపోలేదు. వారిని చక్కటి విధానముతో సరియైన దారిలోకి తీసుకురాడానికి ప్రతితల్లి ప్రయత్నించాలి. అది యెట్లా అంటారేమో. మాటకు చంటిపిల్లల్ని తీసుకుందాం. రెండుమూడేళ్లు వచ్చేవరకు వాళ్ల కీప్రపంచముతోనే సంబంధముండదు. అటుతరువాత వాళ్లు వచ్చీరాని మాటలతో మనల్ని ఆనందపరుస్తూ యుంటారు. కొన్ని సమయాల్లో అంటే మనం పని సందట్లోయున్నప్పుడు, లేదా యెవరితోనో మాట్లాడుతూ యున్నప్పుడు, వాళ్లు అల్లరిపెడుతూ యుంటారు. లేదా యింకా బొబ్బపెట్టి యేడుస్తారు. అటువంటి సమయాల్లో వాళ్లని ఊరుకోబెట్టడానికి యింకో విధం తెలియక యీ అర్థంలేని 'బూచబ్బి' అనే పేరుతో వాళ్లని దడిపిస్తారు. పాపం. అదేదో అనుకుని ఒక్క మాటుగా ఊరుకుంటారు. ఇదొక బాగుందని ప్రతీయింట యిదే వాడుకయిపోయింది. కాని అది రానురాను పిల్లలకు మంచిదికాదని, పెద్దయినా వారిలాగే పిరికి పందలవుతారని యేతల్లి గ్రహించదు. దానివల్ల మాకేం నష్టముంటారేమో. మీ పిల్లల నష్టము మీకు కాదు? అంతెందుకు. మొన్న మా పొరుగింటిలోయున్న సత్యవతమ్మగారికోడలు యిలాగే వాళ్లత్తగారు కొంచెం ఆ కవతల పారేసిరామ్మా 'అంటే' అమ్మో నాకు భయమండీ అని చెప్పింది. యీ భయం యెలావచ్చిందంటారు. వాళ్లమ్మ చిన్నప్పుడా పిల్లని యిలాగే భయపెట్టియుండాలి. అంచేత మీరు మీ పిల్లల్ని యీ వాళనుంచి భయపెట్టకుండా ఉంటారుకదూ. ఇంకేదైనా విధంచూడండి. అంతేగాని వాళ్లని పిరికి పందల్ని చేసి మన యీ దేశంలోకి వదలకండి.

మనలో యింకో సంగతి యేమంటే పిల్లలు మనల్ని అనేక సంగతులు అడుగుతూ యుంటారు. మనఅలవాటుప్రకారం వాళ్లని కూకలేసి పొమ్మంటాం. వాళ్లదే సందేహాలు కడుపులో పెట్టుకుని వాటిని తెలుసుకోలేక బాధపడుతూ యుంటారు. అదేవిధంగా వాళ్లు పెద్దయి చదువుకున్న రోజుల్లోకూడా వాళ్లదే సందేహాలు ఉపాధ్యాయుల్ని- అడగకుండా యేదో బడికిపోయి వస్తూయుంటారు. యీ విధంగా ఉంటే వారికేం చదువు వస్తుంది? వారేం పెద్దవాళ్లవుతారు? దీని కంతటికి బాధ్యులం మనమేయని ఒప్పుకుంటారా? అంచేత నేనన్నది యేమంటే పిల్లలు అడిగేవి కొన్నికొన్ని విషయాలు చాల చమత్కారంగా ఉంటాయి. కొన్ని విషయాల్లో మనంకూడా సమాధానం చెప్పలేకపోతాం. అలాంటప్పుడు వాటిని తెలుసుకుని వాళ్లకి తెలిసేటట్లు చెప్పి వాళ్లని మంచి దారిలో పెట్టాలి. సరిగా వింటున్నారుకదూ. వినడమే కాదు సుమండీ. విన్నది ఆచరణలో పెట్టాలి. అప్పుడే దాని విలువ మనకు బోధపడేది.

యిక పిల్లలు పెద్దవాళ్లవుతారు. బడిలో చదువుకుంటూ యుంటారు. కొత్త విషయాలు తెలుసుకుంటూండడంవల్ల వారికదో ఆశ్చర్యం కలిగిస్తూ యుంటాయి. ఆటువంటప్పుడు వారికేదైనా సందేహాలు కలుగుతే వెంటనే వాటికి తగుసమాధానం చెప్పాలి. మంచిమంచి కథలు నీతులు, పురాణ కథలు, అప్పుడప్పుడు చెప్తూయుంటే ఆ విధంగా వాళ్లూ నడుచుకుంటే బాగుంటుందని తెలుస్తుంది.. మాటకు మీరు మీ పిల్లలకు 'హరిశ్చంద్ర' కథ చెప్పేరనుకోండి. దాని వలన వాళ్లకు యెప్పుడూ సత్యమే చెప్తూండాలని తెలుస్తుంది. యీ విధంగా మీరు వాళ్లను మంచి దారిలో పెట్టగలుగుతారు. అయితే మీరు యింకొకటి అడుగవచ్చు. బాధ్యత ఒక్క తల్లిదే కాని తండ్రికిలేదాఅని. తండ్రికీఉంది బాధ్యత కాని సహజంగా పిల్లాడికి తండ్రి దగ్గరకంటే తల్లి దగ్గరే యెక్కువ చనువుంటుందని నా నమ్మకం. దీనికి మీరేమంటారో? మీ యుద్దేశాలు నాకు తెలియపరుస్తే వచ్చే సంచికలో మీకు యీ గృహలక్ష్మి సంచికలో సమాధానం చెప్పుకుంటాను.

మాకూ ఓ అబ్బాయి ఉన్నాడులెండి. చిన్నవాడే కాని చెడ్డబండ. కాని మీలానేను భయపెడతానుకున్నారేమో. ఆ వెర్రి మీ కెన్నడూవద్దు. మీ ధర్మమా అంటూ మా అబ్బాయికి పాట అంటే యెంతో యిష్టం. ఒక్క పాటకు నిద్రపోతాడు. లేకపోతే నాకు తీరికయేది మీకీ సందేశాన్ని పంపడానికి.

మళ్లీ వచ్చే సంచికలో కలుసుకుందాం. యిక సెలవు.



(416 తరువాయి)

ధాన్యమునేదైన యొకదానిని తగుమాత్రము తీసుకొని రాయి, మన్ను ఇతరపదార్థములు లేకుండ బాగుచేయవలయును. ఆ తరువాత వానిని నీళ్లలో నానబోయవలయును. ఆ నీళ్లలో నానబోసినప్పుడు తాలుగింజలు తేలిపోవును; వానినెత్తి పారవేయుము. ఆ నానబెట్టిన వానిని బాగుగా ఆరబెట్టవలయును. తడిపూర్తిగా ఆరినపిదప - వానిని సన్నని శగపై దోరగ వేయించవలెను. ఘుమఘుమ వాసన వచ్చులే వేగినందునకుగుర్తు. అప్పుడుదించి మెత్తగా తిరుగలిలోబోసి విసరవలెయును. ఆ విసిరిన పిండికి పిండిజల్లెడతో జల్లించవలయును. ఆ విధముగా నేర్పడిన పిండిలో కొంచము గరుకు పంచదారను చేర్చుట రుచికరము. కొంచముగ "టేబిల్ సాల్టు" అనే తెల్లఉప్పునుకూడ చేర్చవచ్చును. కంటికింపుగా చాకొలేటురంగును చేర్చవచ్చును. మరియు సువాసన నేదైన చేర్చుటయు హితకరమే.

ఈ విధముగా తయారైన పిండిని డబ్బాలలోచేర్చి - గట్టిగా మూతబిగించి - పైన అర్హమగు చీట్లనంటించి విక్రయించుట అవసరమైనవారికి చక్కని బ్రతుకు తెరువు.

ఈ పిండిని సలసలకాగు తెగినన్ని నీళ్లలో ఒకటిరెండు చంచాలువేసి - కొద్దిగా ఉడకనిచ్చి - పాలుపోసి దించి - కోకో, కాఫీ, వోవల్‌టిన్ మున్నగు వానివలెనే ఆరగించినచో శ్రమతొలుగును; ఉత్సాహము కలుగును. సులభముగా జీర్ణమగును. పుష్టినిచ్చును. పథ్యము పుచ్చుకొనుచున్నవారికి, చూలింతలకు బాలింతలకు పాలువిడిచి అన్నము తిననేర్చిన బిడ్డలకు, వృద్ధులకు, కాయకష్టముచేయు పనివారలకు, బుద్ధికి పనిపెట్టు పెద్దలకు అందరికిని ఉపయుక్తమగు ఆహారము. శ్రీ గవర్నర్ జనరల్ రాజాజీగారు కోరినట్లు శాలిచాలని వరియన్నముతో పాటు ముతకధాన్యములనుకూడ నాజూకుగ తినుటకిది యొకఉపాయము.

# సదయ హృదయ

శ్రీమతి నృసింహ సామ్రాజ్యలక్ష్మీతులసిగారు

పతిని దైవంబుగా నెంచి భావమందు,
ప్రేమ దేవతోపాసనా నీమ గలిగి,
మదిని నినుగోరు నీకాంత హృదయ మఱయు ;
సరసవిద్యావిశారదా ! సదయహృదయ !

మెఱుపునంటుచు న్నల్లదె మేఘమదిగో,
లతకు మారాకు నిలచెన ల్లదిగో జూడు,
వెలుగు చుక్కల గూడు జా బిల్లి యదిగో,
సరసవిద్యావిశారదా ! సదయ హృదయ !

మగువల వయసు లామని మాధవుండో,
కాంతల తలపు లోపలి గార డీడో,
ఇంపు మదవతి గమ్మదనంపు వాడో
ఎవనిగా నెంతు ప్రాణేశ ! నేను, నిన్ను,
సరసవిద్యావిశారదా ! సదయ హృదయ !

ఆమనీ సమయ వసంతమఱయుమయ్యా,
పూలముత్తెముల సరాల బూనుమయ్యా,
చిగురు కెంబాయ మధుపర్క చేలమిదిగో,
సరసవిద్యావిశారదా ! సదయ హృదయ !

నేన నీకోర్కెమీఱ నాతిథ్య మిత్తు
శ్రమను బోగొట్టు ఫలరస సారమిదిగో,
పూలచెండ్లివె కైబూను భోగరాజ,
సౌధ సోపానములవిగో సౌఖ్యమొందు,
సరస విద్యావిశారదా - సదయ హృదయ !

# స్వచ్ఛమైన అబద్ధం

"నెమలి"

జానకీ, వాళ్ళమ్మా, ఒకరినొకరు చాలా ప్రేమించుటవలన, వారివారిమనసులను నొప్పికలుగకుండునట్లు నిజమును దాచిన, అది అబద్ధమనతగునా?...

ప్రపంచమంతా తాకివస్తున్న చలి, ఆ చిన్నియింట్లో ప్రవేశించక మాస్తుందా? ఇంటి వెనకభాగం. చీకటికొట్లో జానకి, వాళ్లమ్మమ్మ పక్కమంచంపై ముడుచుకుని కూర్చొంది. అమ్మమ్మ యీ లోకంవిడచి చాలా రోజులయికూడాను ఆ చీకటికొట్టింకా అమ్మమ్మకొట్టే. తన లేతచేతుల్ని వెచ్చగావుంచుకోడానికి పరికిణీతో కప్పుకుంది జానకి. తనక్కడ కూర్చుంటే వాళ్లమ్మకు తెలియదుగా!

అమ్మ తెమ్మన్న దారపుంట నడుములో చెక్కింది, యింకా అలాగేవుంది. గ్రుచ్చుకుంటూవుంది కూడాను. బడినుండి వచ్చినవెంటనే అమ్మకివ్వలేదు తను. కాని యిప్పుడే అమ్మ మొహం యెలాచూడటం? అబ్బ! ఇవ్వాళ బళ్ళో తనకెంత అవమానం జరిగింది! అదిగో సుబ్బిశెట్టి అంగడి. జానకి దారపుంటకోసం దుకాణంలోనికి వెళ్లింది. అక్కడేవున్నది కమలకూడాను. తన స్నేహితురాండ్రు విమలా, సరళ, శకుంతల, సావిత్రులతో అందరూ సెల్యూలాయిడ్ బొమ్మలూ, పుట్టిన పండుగ పత్రికలూ చూస్తున్నారు. ఎంచక్కావున్నాయి! రంగురంగుల బొమ్మలు! తన కెప్పుడూ అలాంటి బహుమానములు రాలేదు. తనపుట్టినరోజుకి అమ్మే అన్నీ చేస్తుంది. అమ్మ చేసినవెంతో బావుంటాయి. అవును చాలా బావుంటాయి. అయితే-కమలో? కమల తన స్నేహితులతో "ఏమర్రా నాపుట్టినరోజుకి, చక్కని బొమ్మలు రాసిన ఆహ్వానపత్రికలు తెప్పిస్తారట. మిమల్నందరినీ పిలిచాననుకోండి" అంటున్నది. జానకిని పిలవలేదు. తనవైపు చూడనూలేదు. తనతో మాట్లాడనూలేదు. ఫరవాలేదు! ఏంమునిగిపోయింది పిలవకపోతే? ఫరవాలేదు! అనుకుంటూ కూర్చుంది జానకి. కండ్లు గట్టిగా మూసేసుకుంది. పాపం! అశ్రుధారని నిలుపుకుందామని కాబోలు!

"జానకీ! జానకీ!" అమ్మ పిలుస్తున్నది కాని తను వినిపించుకోలేదు. కండ్లు మూసుకొని మనోరాజ్యంలో విహరిస్తున్నదా? మనోవేగంతో గ్రామంలో వాళ్లింటికి పయనంచేసింది. వాళ్లతోటలోని చక్కని రోజా, మల్లె, సంపెంగపూలు ఒడినిండాపోసుకొని, అమ్మకోసం తీసికెడ్తూ, మామిడిచెట్టుపై కోయిలకూయడం వింటూ అలాగే నిలబడిపోయింది. అమ్మకి పూలసరం గ్రుచ్చి, కోయిల పాడినపాటను పాడి వినిపిస్తే!

గలగలా ప్రవహిస్తున్న చిన్న నదిప్రక్కన నిలుచుంది. ఆ సెలయేరుకూడా పాటపాడుతూవుంది! ఒక పడిపోయిన చెట్టు తొఱ్ఱపై కూర్చుంది. ఇంతలో వాళ్లకుక్క ఫ్రిస్కీ పరుగెత్తుకుంటూ వచ్చింది. తన్ని చూసి నవ్వి, వంగి నమస్కారం చేసింది. అరే! మొఱుగలేదే!

"నమస్తే జానకీ!"

ఫ్రిస్కీ నిన్ను విడచివుండటం యెలావుందనుకున్నావే? అబ్బ నాకు పట్నంలోవుండటం యిష్టమే లేదు. అయితే ఏంచెయ్యటం? నాన్నారికి పెద్దనష్టమొచ్చి, గ్రామంలో భూములన్నీ అమ్ముకుని పట్నం

వెళ్ళవలసివచ్చింది. పట్నం అసహ్యంగావుంది. మాబడికూడా అలాగేవుంది. ఫ్రిస్కా నువ్వూ మాతోవచ్చి వుంటే యెంతబావుండేది ?" అన్నది జానకి. తన మనసులోనివేదన అంతా ఫ్రిస్కాకు చెప్పుకుంటూ. ఫ్రిస్కా, జానకి నోదార్చి, అలా కంగారుపడకూడదనీ, నాన్నారిని తొందరచెయ్యకూడదనీ, అమ్మకు సాయం చెయ్యమనీచెప్పి, తోకాడించుకుంటూ వెళ్లిపోయింది.

జానకి కండ్లుతెరిచింది. ఆ చీకటిగది మరీ చీకటిగావుంది. ఏమీ కనుపించటంలేదు. కాని భయంకరమైన రూపాలు తనచుట్టూ తిరుగుచున్నాయి. ఎంతఘోరంగా వున్నదాగది ? తన ప్రేగుల్లోనుండి పుట్టుకొస్తూంది ఆ భయం. ఎందుకో ? నాన్నారికి నష్టం వచ్చుండకపోతే - అలా గయితేనా-నాన్నారెప్పుడూ అలా కోపంగావుండరు. అసలు రాత్రిళ్లు పనిచేయనక్కరలేదు. అన్నిటికంటే ముఖ్యం ఫ్రిస్కా వుండేది తనతో. అప్పుడు బళ్ళోపిల్లలందరికీ తనంటే యెంతో అపేక్షవుండేది. జానకి వూహాలన్నీ ఆ భయంచుట్టూ తిరుగుతున్నాయి. తనంటే ఎవ్వరికీ యిష్టంలేదనేభయం.

ఆ రోజు యింకా కండకు కట్టినట్లుంది. రాత్రి వాళ్ళయిల్లువదలి, యీయింటికి వచ్చేశారు. అమ్మ యేడుస్తూవుంది. ఫ్రిస్కా వాళ్లతోరాలేదు. క్రొత్తయిల్లు సర్దుకోవటంలో రోజులు గడిచిపోయినాయి. మళ్ళా యివ్వాళ దుకాణంలోవచ్చింది అభయం. తనకూ ఆహ్వానపత్రికరావాలి. ఎలాగైనారావాలి. వాళ్లందరికీ తనమీద యిష్టంకలిగితే యీ భయంపోతుంది. కాళ్లూ, చేతులూ చల్లబడ్డాయి. చెవులు గింగురుమంటున్నాయి. మొదట ఏడుపుశబ్దంవిని తన చెవులే గుయ్యిమంటున్నాయనుకొంది. మళ్లీ వినబడింది అదే శబ్దం.

మంచంమీదనుండి ఒక్కగెంతుతో పడకగదివైపు పరుగెట్టింది. తలుపుతోసి అలా చూస్తూ నిలబడింది. కండ్లింత పెద్దవిచేసుకొని తనుచూసే దృశ్యం నమ్మలేకపోయింది. అమ్మ కుట్టుమిషనుపై తల పెట్టుకొని వెక్కివెక్కి యేడుస్తూవుంది. అమ్మ కుడుతున్న తెల్లటిబట్ట నలిగిపోయి క్రిందపడివున్నది. అమ్మ ఏడుస్తూవుంది !

"అమ్మా !" ఆ చిన్ని హీనకంఠస్వరం ఆమెకు వినబడనేలేదు. అమ్మ మెడను చేతులతో పెనవేసుకొని జానకికూడా యేడుస్తూవుంది. అమ్మ తిరిగిచూచి తన కన్నీళ్లుతుడుచుకుంది.

"ఎందుకమ్మా యేడుస్తున్నావ్ ?" అని కమ్మిపోయిన గొంతుతో అడిగింది జానకి.

మృదుహస్తములు జానకిభుజాన్ని తడుముతున్నాయి. "చిట్టితల్లీ నేనొకరహస్యం చెబుతావిను. ఎవ్వరితో చెప్పవుకదూ ?"

జానకి యేడుస్తూ మొహంపైకెత్తింది. రెండుకండ్లలో రెండునీటిచుక్కలు నిలచివున్నాయి - అమ్మ చెప్పే రహస్యం వినడంకోసం. అమ్మ మెల్లగా జానకిచెవిలో,

"ఇంక కొద్దిరోజుల్లో మన యింటికో చిన్నపాపాయొస్తుంది. నీకు చిట్టిచెల్లెలో, తమ్ముడో. చిట్టి తమ్ముడు కావాలా ?" అన్నది.

జానకి యేమీచెప్పలేదు. సంతోషం, భయం, సిగ్గూ అన్నీకలసిపోయినాయి తనకి. అమ్మ ఒడిలో తలపెట్టుకొని చాలాసేపు కూర్చుంది. ఆఖరుకి వాళ్ళమ్మ,

"ఏమ్మా, నీకు సంతోషంగా లేదూ ? చిన్నపాపాయొస్తే బావుండదూ ?" అని అడిగింది.

"అమ్మా, నీకు సంతోషంలేదే ! నువ్వు యేడుస్తున్నావుగా !"

"చిట్టితల్లీ, నేను యేడ్చినదెందుకో తెలుసా ? ఎందుకంటే - నాకు - చాలా సంతోషంగావుంది."

"అయితే నాకూ సంతోషమేనమ్మా."

ఇంతలో నాన్నారు మేలుకొన్నారు. నాన్నారి కీ రహస్యం తెలుసా? అమ్మనడుగుదామనుకొంది జానకి. ఇంతలోకి అమ్మ లేచి, "అసలు మరిచేపొయ్యాను. ఇవ్వాళ నీకోగమ్మత్తు వచ్చింది, కండ్లు మూసుకో" అని నవ్వుతూచెప్పింది. జానకి కండ్లుమూసుకొంది.

"ఏదీ; నీకే చేతులోది కావాలో చెప్పుకో."

"రెండూ కావాలి."

"అమ్మో! అవ్వా కావాలి, బువ్వా కావాలా? ఇదుగో తీసుకో" అని అమ్మ ఓపెద్ద కవరు యిచ్చింది. జానకి గబగబా విప్పిచూచింది. ఆహ్వానపత్రికే. అవును. తనకేవచ్చింది. "హై! హై! ఇంకేం. అమ్మా నన్నూ పిలచిందే కమల. తన పుట్టినరోజుకి. అయితే యిదేమిటీ? త-మా-షా-వే-షా-లు, అంటే ఏంటమ్మా?"

"ఏమీలేదు. నువ్వో చక్కనిపిల్లలాగో, లేక కథల్లోవచ్చే తమాషావేషాలో వేసుకోవాలి. నువ్వెలా వుంటావు?"

"అమ్మా నేనో చక్కటి అమ్మాయిలాగ వెడతానే! అయితే నాకు చక్కటి పరికిణీచొక్కా లేవుగా!"

"ఫరవాలేదు. నాదగ్గర మంచిబట్టవుంది. నీకు కుట్టిస్తానులే."

"తక్కిన పిల్లలు కొంటారేమో -"

"తరువాత చూద్దాం. వెళ్లి ఆడుకో. నాన్నారికి పనివేళయింది, వడ్డించాలి. వెళ్లు, వెళ్లు."

"అలాగే." జానకి సంతోషంతో గంతులేస్తూ వెళ్లిపోయింది, తన కీ పిలుపొచ్చింది!

నాన్నారు భోంచేసి వెళ్లిపోయారు. జానకీ, వాళ్ళమ్మా, మేడమీదికెళ్లారు. కమలకు, అమ్మకుట్టిన, పూలతో చక్కగావున్న చేతిరుమాలు, బహుమానంగా యివ్వటమని తీర్మానించారు. ఇక జానకి, పరికిణీకో? అప్పుడే అమ్మకు జ్ఞాపకమొచ్చింది. ఓ పెట్టినుండి అందమయిన కాగితంతీసింది. దేనికోసం? తనకేనట! అమ్మ చెబుతూవుంది. ఆ కాగితంతో చక్కని పరికిణీ, చొక్కా, అమ్మ కుడుతుందట! ఇంకేం! కమలకు బహుమానం, తనకు క్రొత్తవేషమూ వున్నాయిగా, జానకి హాయిగా నిద్దరోయింది.

ప్రొద్దునలేవంగానే జానకి తనపరికిణీ చూచింది. ఎంతబావుంది! పసుపూ, తెలుపూ, రేకులతో విచ్చిన తామరపూవులావుంది పరికిణీ! ఆకుపచ్చటి చొక్కా. అంతా ఆకాగితంతో చేసినదే. ఆరోజంతా యెలాగ గడచిపోయిందో తనకు తెలియదు. మధ్యాహ్నం మూడుగంటలకే, తనపరికిణీ, చొక్కా వేసుకుంది. చక్కగా తలదువ్వుకొని, రుమాలు, ఓ చిన్నపెట్టిలో పట్టుకొని, కమల యింటికివెళ్ళింది. కమల నాన్నారికి చాలా ధనంవుంది. పెద్దభవనంలోవున్నారు వాళ్లు. కమలయింట్లో వాళ్లమ్మ, జానకితెచ్చిన బహుమానం తీసికెళ్లి బల్లమీదపెట్టింది. ఆ బల్లమీదే ఎన్నోబహుమానాలున్నాయి. వాటిలో తన చిన్నిపెట్టి కనబడుతుందా? కమలకు తనుతెచ్చిన దేదో తెలుస్తుందా? కమల, తన స్నేహితురాండ్రు, చక్కటి పట్టుపరికిణీలు, సిల్కుగౌనులు వేసుకొని ఆడుకొంటున్నారు. అందరివీ బనారసుపట్టు పరికిణీలే.

ఇంతలోకి కమల గబగబా వచ్చి జానకిచెయ్యిపట్టుకొని

"జానకి నావేపు" అన్నది.

"కాదు, కాదు, నావేపు" అని మరోచెయ్యిపట్టుకుంది శకుంతల. ఇద్దరూలాగారు. జానకి ఆనందాన్ని చెప్పనవసరములేదు. వాళ్లకి తనుకావాలట! వాళ్ళందరకూ తనంటే యెంతయిష్టమో!

కమలా, శకుంతలా లాగటంలో క్రిందబడ్డారు. వారితోకూడా జానకి. పరికిణీలో ఒక తామర రేకు వూడిపోయి వ్రేలాడుతూవుంది. మొహం ఎఱ్ఱబారింది. తలవంచేసుకొని యేడుద్దామనిపించింది. తక్కిన పిల్లలందరూ యీవింతజూచి నవ్వటం మొదలెట్టారు. తనచుట్టూ తిరుగుతూ, చప్పట్లుకొడుతూ,

"కాగితంతో చేసిన పరికిణీ కట్టుకుందీ,
వాయ్యారంగా వచ్చిందీ - పుట్టినరోజుకీ,
కాగితంపరికిణీ - కాగితంపరికిణీ,"

అని వెక్కిరిస్తూ గోలచేస్తున్నారు. ఇంతలోకి కమల తల్లివచ్చి "ఛా! ఇప్పుడే నిలపండి. జానకి నలా యెందుకేడిపిస్తారు' చాలు, చాలు. కమలా, నువ్వుకూడా నీ అతిథి నలా చేయవచ్చునా? వూరుకోండి. అని నాలుగు చీవాట్లుపెట్టి, జానకిని మరోగదిలోకి తీసికెళ్ళి, ఆ రేకును యథాప్రకారం కుట్టింది.

"ఎంత బావుంది నీ పరికిణీ, మీ అమ్మ యెంత తెలివిమంతురాలో, యిలా కాగితంతో కుట్టడానికి" అని సమాధానంగా యెన్నో చెప్పింది. కాని జానకిగుండెలోనిభారం అలాగేవుంది. ఏమీ బదులుపలకలేదు. మళ్లీ కమల వాళ్లుండేగదికి తీసికెళ్లారు.

ఈసారి జానకివైపు ఒక్కమ్మాయికూడా చూడలేదు. వారిలోవారు ఆడుకున్నారేగాని జానకిని పిలవలేదు. జానకి మనస్సులో ఒకటే ఆలోచన. ఎప్పుడు అయిదున్నరగంట అవుతుందాఅని. అప్పుడు వెళ్లిపోవచ్చునుగా. మనస్సులో దేముణ్ణి ప్రార్థించింది అయిదున్నర కానివ్వమని. ఎప్పటికీ కాలేదు. తాను వాళ్లముందే చనిపోతే బాగుండుననిపించింది. అప్పుడైనా వాళ్లు పశ్చాత్తాపపడతారుగా! ఇంటికి వెళ్లటానికీలేదు. అమ్మతో అయిదున్నరకేగా వస్తానన్నది. ఇప్పుడేవెడితే ఏంచెప్పడం?

కమల తన బహుమానాలన్నింటినీ చూస్తోవుంది. తను తెచ్చిన రుమాలు చూసైనా సంతోషిస్తుందా? లేదు. ఆ రుమాలు తీసినప్పుడు కమల తనవంకైనా చూడలేదు. జానకి, కమల తల్లిని అయిదున్నరయిందా అని అడిగింది. లేదన్నదావిడ. వాళ్ళందరికీ తినటానికి లడ్లూ, మైసూరుపాకులూ తెచ్చారు. తనకేమీ తినాలనిపించటంలేదు. ఆఖరుకి అయిదున్నరకొట్టింది. కమల తల్లి, పిల్లలందరికూ మిఠాయిపొట్లములు పంచి యిచ్చినది. జానకి తన పొట్లంతీసుకొని వాళ్లదగ్గర సెలవుపుచ్చుకొని వేగంగా యింటికివెళ్లింది. అసలు కమల గారింటి వీధిమలుపు తిరగంగానే పరిగెత్తటం మొదలెట్టింది.

ఇంటికిరాగానే వాళ్ళమ్మ, "జానకీ వచ్చావమ్మా? ఎలావుండింది కమల పుట్టినరోజు పండగ!" అన్నది.

"ఎంతో బావున్నదమ్మా, కమలా, విమలా బనారసు పరికిణీలు కట్టుకున్నారు. మాకు, మైసూరు పాకులూ, లడ్లూయిచ్చారు. మేము తమాషాగా యెన్నోఆటలు ఆడుకొన్నాం. ఇదిగో నీ కీమిఠాయి పొట్లం తెచ్చాను." అమ్మ వంగి పొట్లం తీసుకొంది, అప్పుడు చూసింది, జానకి కండ్లలో ధారలుధారలుగా నీళ్లుకారటం.

"చిట్టి తల్లీ, యెందుకేడుస్తున్నావమ్మా? నీతో యెవరూ ఆడుకోలేదు?"

"ఓ అందరూ ఆడుకున్నారు. నే నెందుకేడుస్తున్నానో తెలుసా? ఎందుకంటే - నాకు సంతోష మెక్కువ అవటంవలన" అని అమ్మనిచూచి చిఱునవ్వు నవ్వింది జానకి......

# వరకట్నాలు నశించాలి

చావలి విశ్వనాథంగారు

ప్రస్తుతము మనహిందూసమాజమునందు, ఆచారముగా పరిగణించబడు అత్యాచారాల్లో వరకట్నం ప్రాముఖ్యమైనదని చెప్పవచ్చును.

ఈదురాచారం ఏనాడో మనసామాజిక జీవితములో మొలకెత్తింది. యీనాడు ఒకమహా విషవృక్షమై వ్రేళ్లుపాతుకు పోయింది. యీవిషవృక్షచ్ఛాయల్లో, ఎన్నో నిండు ప్రాణాలు, ఎన్నో మధ్యతరగతి కుటుంబాలు నేలకొరుగుతున్నాయి.

ఈ వరకట్నాలవల్ల ఆడపిల్లలనుగన్న తల్లిదండ్రులు పడుచున్న బాధ వర్ణనాతీతము. తల్లిగర్భమునుండి ఆడపిల్ల జన్మించినదని తెలియగనే, అంతవరకు ఉత్సాహముగ నున్నతండ్రి, కృంగి దీనవదనుడై చూపరులకు జాలికొలుపునట్లు, కనపడుచుండును. దీనికి కారణమేమి? తనకు తిండియున్నను, లేకున్నను, వారిని పెద్దవారినిచేయుట యొక యెత్తు, సకాలమునకు వివాహముచేయుట యొక యెత్తుగ నున్నది.

పూర్వము కన్యాశుల్కం ముండెడిది. అప్పుడు ఆడపిల్లలకు, వందలు వేలు ఇచ్చి వివాహమాడుచుండెడివారు అట్టిది తారుమారై, మగపిల్లలను ఆడుసంతతివారు వేలకు వేలుపోసి కొనుక్కొన వలసినగతి పట్టినది. రానురాను యీవరకట్నాలు వకవర్తకం, (Business)గా మారినది.

యుక్తవయస్సు వచ్చినప్పటినుండి తండ్రిపిల్లలకు పెండ్లినిమిత్తము వరునకై ప్రతి గ్రామము, ప్రతిపట్టణము తిరిగి తిరిగి వేసారిపోవుచు, తగినవరుడు దొరకక యింటికి వచ్చి కాళ్లుజాపుకు కూర్చుండును.

పెద్దమనిషియైన పిల్లకు పెండ్లిచేయలేదని లోకులు కాకులవలె పొడుచుకొని తినుచుందురు. ఇవి అన్నియుచూచి, తండ్రి కూతురుపై కోపగించుకొని తిట్టికొట్టి విసుగుకొను చుండును.

యీ పరిస్థితులన్నిట జ్ఞానమువచ్చిన ఆడపిల్ల తనవలన తల్లిదండ్రులు పడుచున్న బాధ, అలజడిని చూచి తనలోతాను విచారించు చుండును. ఆఖరికి ఏ కురూపికో మూడోపెళ్లి ముదుసలికోయిచ్చి తనబాధ్యత తీర్చుకొనును. ఇంక అత్తవారింట పిల్లపడు బాధ వర్ణనాతీతము. తన తాహతుకు తగినవరునికి యివ్వవలెనన్న ఎక్కువ కట్నము యివ్వవలెను. అట్లుయిచ్చిన పదుగురు ఆడపిల్లలుగల గృహస్థు అయిన యెడల మర్నాటికే చిప్ప చేతికివచ్చును.




శ్రీమతి ఈమని వెంకటలక్ష్మిగారు

సిరికి సంపదకిరవగు శ్రీపురంబు
నందు వణిజుండు పైడిసెట్టనగనొప్పు
నతులితైశ్వర్య భాగ్య భోగాన్వితుండు
కూతులిర్వురు గూరిమి గూర్చుచుండ.

పిల్లికిని, బిచ్చమిడనట్టి పిసినిగొట్టు,
దాచుచుండెను ధనమెంతో, దారసుతల
దరతరాలకు దగినట్లు దానుగూడ
కడుపునిండగ దినకుండ గడపుచుండె.

ధనము యొక్కనాడు దనచెల్లెలును దాను
వేడుకలరమాటలాడు కొనుచు
"గొప్పవారికెట్టికొదువ గల్గునెభువి ?"
నన్నయక్క కనియె నప్పుడు జయ,

"అక్క ! ధనమె గొప్పదనరాదుసుమి, మంచి
గుణము గొప్పతనము గూర్చు నందు,
భూతదయకుసాటి భువిలే" దనిన, నౌను
కా, దటంచువారు వాదులాడి.

అంతనొకనాడు కోమటి యనుగుసుతలు
పరుగు పరుగున దమతండ్రి పజ్జజేరి
"తండ్రి ! అన్నింటికిని మిన్నధనము కాదె?
దానిమించిన దున్నదే ధరణిజెపుమ ?"

అనుచుధనలక్ష్మి జయలక్ష్మి లడుగుచుండ
ముద్దుకూతుల మాటకు మోదమంది
మిగులసంతసమున సెట్టి "మగువలార !
ధనమునకు సాటిమేటి యీధరణిగలదె ?"

"ధనముతో సరిచూడగా దగినయట్టి
వస్తువింకొక్కటియు లేదు వసుధలోన
ధనమునకు మిన్నయని జెప్పదగినయట్టి
దెద్దియునులేదు లేదీ మహీతలమున్న"

"ధనమే సౌఖ్యమునిచ్చును
ధనమే సత్కీర్తినిచ్చు ధనమిహపరసా
ధనము ధనహీను లలమట
జనుచుందురు తిరుపమెత్తి శవములభంగిన్"

ధనములేనివారిదయ్యామేనొల్లదు
బంధుగులుహసించి పరిభవింత్రు !
తల్లి, దండ్రి, భార్య, పిల్లలు, సోదరుల్
ధనవిహీను విడువదలతు రెపుడు.

అయ్యమాటల గడుశ్రద్ధ నాలకించి
మంచిదని ధనలక్ష్మి నెమ్మదిదలంచె,
దానినొల్లక జయయనె "దయకు" సాటి
యున్నదే ? "అంకెలేనట్టి సున్నరీతి"

అనిన జయలక్ష్మిమాటల కాగ్రహించి
పండ్లుగొరుకుచు దాబోయి పైడిసెట్టి,
ముందు చావడిలోకేగ ముసలియొకడు,
"తండ్రి ! బిచ్చంబునిడు" మన దలుపుమూసె.

కొంతకాలమిట్లేగగా కోమట్లయ్య
కూతులకు బెండ్లిసేయగా కోర్కెబుట్టి
కట్నమడుగని దెండ్రైనకలదె ! యంచు
చుట్టుపట్ల సంబంధముల్ జూచుచుండె.

సెట్టిగారంతట శ్రమపడి ధనముకై
యరసి యరసి యొక్క వరునిదెచ్చె
ఈడుజోడును జూచి యేరిబి దానొక్క
క్షత్రవానినిమంచి గొప్పవాని

అన్నదమ్ములుగాని యాస్తిగొంపోయెడి
వారసులును లేనివాని జూచి
మంచిచక్కనివాని మదికినచ్చినవాని
మనముచెప్పినయట్లె మసలువాని

ధనమువెచ్చించి పెద్దకూతునకు ముందు
బెండ్లిగావించె వైభవోపేతముగను
తనకు బదులాడెననుచు క్రోధంబుబూని
పేదవరునకిడదలచె పిన్నకూతు,

కూలినాలిజేసి కొని పొట్టపోషించు
కొనెడు కుఱ్ఱవాని గోరి, నెమకి
తెచ్చి చిన్నతనయ నిచ్చి పెండిలిజేసి
దరల నడిపె వారి దయదొలంగి.

తానుగడుపార గనినట్టి తనయలయెడ
నిట్టి భేదభావంబు జూపించెనహహ!
ధనమె సర్వస్వమనెడి లుబ్ధునకు గలవె
ప్రేమయును పాపభీతియు పృథివిలోన?

తనకుగల్గిన ధనమెల్ల ధారవోసి
పెద్దకూతురి సౌఖ్యంబె పెక్కువిధుల
నరయుచుండెను, ధనలక్ష్మి కంతకంత
కాత్మలో తండ్రిపై ప్రేమ మంతరించె,

ధనమిచ్చునంతవరకే
తనతండ్రిని గౌరవించు ధనమీయకపో
యిననది మొదలుంగదా నా
తనిగని గౌరవమొసంగ, దలపకయుండెన్.

తనకు గలయంతవట్టు, నాదరముతోడ
నిచ్చి, ధనలక్ష్మి తన్నుద్ధరించు నంచు
నాసతో నుండె సెట్టి యయ్యో! ప్రపంచ
మందు విధివైపరీత్య మేమందునింక?

కూతు రల్లుడు దన్ను జాతురాదరమున
నంచునెంచెడి సెట్టి కాసవదలె!
దానధర్మముమాట దలపెట్టబోవక
తన ముందుగతిజూడ, దలపకయును

చక్రవృద్ధులతోడ జనులను వంచించి
కూడబెట్టినసొమ్ము గూర్చికూర్చి
భూములెన్నియొ కొని నేమమన్నదిలేక
ఆర్జించినట్టియా ఆస్తులూడ
క్రొత్తబిల్లొకటొచ్చె కోమటికి వగహెచ్చె
పోయె నెన్నో సెట్టి భూములవుడు
మంచమెక్కెను వాని మనసుచలింపగా
రోజు రోజుకు సెట్టి రోగమెచ్చె
నేదినంబున కెట్లౌనొ యెవరికెరుక?
కూతురును నల్లుడును దనగోడువినరు;

గంజిపోసెడివారైన కంటబడరు
కరుణలేనట్టి కఠినులౌ కారణమున,

ఉన్నధనమంత కూతునకూడ్చిబెట్టు
పైడిసెట్టికిబట్టె నిర్భాగ్యపదవి.
అంకురించెను వార్ధక్య మంతలోన
కాలమొకరీతి నుండునే కడవరకును.

ముసలిదనమున సెట్టికి విసువు హెచ్చ
గసరుచుండును నల్లుడు గఠినుడట్లు
పొసగలేదింక వారికి పొందొకింత
బదులుజెప్పినపైబడి బాదుచుంద్రు.

పెద్దకాలపురోగమె పెరుగుచుండ
అల్లుడును కూతురును చాల యాజ్ఞ సేయ
వారిబాధలు సైరింపవలనులేక
గోడుమనియేడ్చెనొకనాడు కోమటయ్య.

అంతనాగోలకాతని యల్లుడలిగి
భార్యయునుదాను నాతనిబాది, మరియు
నవలకీడిచి దలుపేసి యాలుమగలు
తరలిరచ్చోటువాసి నిర్దయులు కట్ట!

పైడిసెట్టియు బోటపైబడినయంత
కాలువిరిగెను స్పృహదప్పె చాలసేపు;
కండ్లుదెరచియు కడుదప్పి కలిగియరచె
తలపడేమైన ధనలక్ష్మి, తండ్రినింక.

అల్లెపడియుండి సెట్టిచా నరచుచుండ
జయ, పతికి చద్దియన్నమ్ము దయనుమీర
గొనుచు నాదారినేగుచు గోలబెట్టు
తండ్రియేడుపు జెవిబడ్డ తక్షణంబె

పరువిడివచ్చి దండ్రిగని బావురుమంచునుయేడ్చియంతస
త్వరమతి లేవదీసి దన యంకతలంబున జేర్చి జాలితో
గరమునవాని చేతులును గాళ్లను రాయుచు సేదదీర్చియా
దరమతి నూరడింపుచును దండ్రికినిట్లనె
ప్రేమలూరగన్

తండ్రి! యేమిది? నీవిట్లు తల్లడిల్ల
నే కఠినుడిట్లు నిన్ను హింసించినాడు;
అయ్యొ! గొనుమిదె యీ యన్నమారగింపు
మనుచు దండ్రికినిడ నాత డారగించె.

తండ్రి దోడ్కొనిపోవంగ దలచి జయయు
భర్తకును దెల్పదనతండ్రి బాధలెల్ల
విని యతడు మామగోని చని తనగృహమున
నాదరించెను దనకున్న యంతలోన.

కూలిజేసిన నూకలం గూడుజేసి
జనకునకుబెట్టి మిగిలిన జావతోడ
కడుపునిండించుకొనుచును గన్నతండ్రి
కరుణజూచుచు గాలంబు గడుపుచుండె.

అంతనాసెట్టి యొకనాడనుగుబిడ్డ
జేరియిట్లనె దనలోన సిగ్గుపడుచు
అమ్మ ! నీమాటలే నిజమైనవమ్మ,
దయనుమించిన దికలేదు ధరణియందు.

సిరులుగలవారి చెంతనుజేరి బాధ
పడుచు గలకాల మలజడిబడుటకంటె
నెంచగా దయగలవారల పంచనైన
కలియొ గంజియొ త్రాగుటే ఘనముసుమ్మి.

స్వానుభవపూర్వకముగ నిప్పటికిదెలిసె.
ధనముకంటెను దయయె యుత్తమమటంచు;
నీదుమాటలయర్థంబు నెరుగలేక
నిన్నుగినిసితినాడు నాకన్నతల్లి !

దయయే యుత్తమధర్మము
దయయే యజ్ఞంబు తపము దయపుణ్యదమున్
దయ పరమార్థప్రదమీ
దయ కంటెను మిన్నకలదె ధారుణియందున్.

# సారె ఎందుకిస్తారు?

మనలో చాలమందికి ఒక అపోహ ఉంది. ఈసారె అనే ఆచారాన్ని గురించి. భర్తయింట్లో కొన్నివస్తువులుండవనీ, అందుకోసరమని భార్య ఆ అవసరాన్ని పూర్తిచెయ్యడానికి పుట్టింటినుంచి ఆవస్తువులను తెస్తుందనీ అనుకొంటారు సాధారణంగా. అయితే గొప్పవాళ్ళయింటికికూడా క్రొత్తకోడలు సారె తెస్తుందే అని ఒకప్రశ్న పుడుతుంది. దీనికి సమాధానం చెపుతారు కొందరు, "అత్తింటివాళ్ళు గొప్పవారయితే, పుట్టింటివాళ్ళుకూడా ఇంచుమించు అంతే సామంతులు; అందుకని, ఉందికదా అని వాళ్ళూ యిస్తారు"అని. ఇంకా దూరమాలోచించి కొందరంటారు ఇలా: "కోడలువచ్చేనాటికి అన్నదమ్ములతోనూ, తల్లిదండ్రులతోనూ భర్త సమష్టి కుటుంబంలో కలిసిఉన్నా, కొన్నాళ్ళకు అనేక కారణాలవల్ల వేఱవుతాడు. అప్పుడు తమయిల్లు తాము ఏర్పరచుకోవడానికి తనవెంట తెచ్చినసామాను పనికివస్తుం"దని. ఈవిధంగా జరగడం అసామాన్యంకాదు మన దేశంలో. సరే పాశ్చాత్యదేశాలసంగతి చెప్పనేఅక్కర్లేదు. పెండ్లిఅవుతూనే, తల్లిదండ్రులే కొడుకునూ కోడలునూ వేరేఉంచుతారట. వాళ్ళకాపురం వాళ్ళది. వీళ్ళకాపురం వీళ్ళది. చుట్టపుచూపుగా వచ్చిపోతూ ఉండడమే. వేఱుకాపురాలుండడమూ, ఏదైనా వచ్చిందటే, సహాయంచేసి వాళ్ళువేరే అనుకోవడం, ఆసుపత్రులూ, హోటళ్లూ వీటిమీద ఆధారపడడం చూస్తూనే ఉన్నాం. దినదినం దిగనాసిలుతూవుండే స్త్రీపురుషుల ఆరోగ్యం విషయం ఆలోచనీయము. కాని ఇది ప్రస్తుతవిషయానికి కొంత అప్రస్తుతంగా అగుపించవచ్చు.

సరే, ప్రస్తుతానికి వద్దాం. ఎన్నికారణాలూహించినా, మానసికతత్త్వాన్ని ఆధారంచేసుకొని ఈసారె ఏర్పాటయిందని ఊహిస్తే బాగుంటుంది. కొత్తగాకోడలు కాపురానికివచ్చిందా? కొత్తయిల్లూ, కొత్తమనుష్యులూను. పుట్టింటిదగ్గరనుంచి ఎవరు వచ్చిఎన్నాళ్ళు తనతో ఉండడంవల్ల పడుతుంది? ఎవరో మహాధనికులు, పుట్టింటినుంచి దాసదాసీజనం పంపించారంటే, అది అందరికీ ఎట్లా అన్వయిస్తుంది. కాబట్టి, ఈక్రొత్తదనంవల్ల ఈ అమ్మాయికి ఒకవిధమైనబెంగ, అస్వతంత్రత ఏర్పడడం సహజం. చిన్నతనంవల్ల చెయ్యిజారి ఏరాచిప్పో పగిలిందనుకోండి. చీవాట్లుతగులుతాయి; అదే పుట్టింటివారిచ్చారనుకోండి. తనుతెచ్చుకొన్నవస్తువు తానే పగలకొట్టుకుంది అంటారు. ఇదేవిధంగా వస్తువులవాడకం విషయంలోకూడా. బెరుకులేకుండా తనవస్తువులు తాను యథేచ్ఛగా వాడుకొనే స్వతంత్రత ఉంటుంది సారెతెచ్చుకున్న అమ్మాయికి. మీమంచంమీద నెందుకు పడుకోవాలి, అని అనడంకూడాకద్దు, ఎప్పుడయినా, మంచం తెచ్చుకొని క్రొత్తకోడలు. తరువాత పుట్టింటిదగ్గర్నుంచి అన్ని క్రొత్తవస్తువులే తెచ్చుకోఅక్కర్లేదు. ఉపయోగపడేవి (యుద్ధపుకరువులో వెలకుకూడా దొరకనివి) అయితే, ప్రాతవస్తువులే

తెచ్చుకోవడం జరుగుతుంది. ఆవస్తువులను చూచుకొంటూంటే సొంతవాళ్ళను చూచుకొన్నట్లుంటుంది. కృష్ణుడు మధురా నగరానికి కంససంహారార్థంవెళ్ళితే, కదలకుండా గూట్లోఉన్న పిల్లంగ్రోవినిచూసి కొంత ఊరటచెందిదట. యశోద. ఇంతకుచెప్పవచ్చిందేమంటే, పరిచితవస్తువులు అనేకవిషయాల్ని, జ్ఞాపకానికితెచ్చి, మనస్సును నింపుతాయి. ఆయా దృశ్యాలు కళ్ళకుకడతాయి.

మానవప్రకృతి అంతా ఒక్కటేకదా! 18-వ శతాబ్ది ఉత్తరార్థంలోనూ 19-వ శతాబ్ది పూర్వార్థంలోనూ ఉన్న "గోయ్‌థే" అనేజర్మన్ మహాకవి, "హర్మన్ ఉండ్ (and) ఉరోథియా" అనే కావ్యంలో, కొత్తకోడలింటికి వచ్చినప్పటిసంగతి వర్ణించాడు. వ్రాశాడు.

దానికి తర్జుమా ఏమంటే— (తండ్రి అంటాడు) "అవును, నాకు తెలుసు- తనసొంత వస్తువులను వంటింటిలోనూ, గదిలోనూ చూచుకొంటూ, తను సొంతంగా పక్క, టేబిలు సర్దుకొంటూఉంటే కోడలు ఎంతసంతోషంగా ఉంటుందో!"

కాబట్టి సారెవిషయంలో ఈమానసికతత్వమే ప్రధానసూత్రమని చెప్పడమే ఈనాల్గుముక్కల ఉద్దేశమూను.

కోట సుందరరామశర్మ

# మాతృహృదయము

మాతాపితరులు ప్రత్యక్ష దైవములు. ఇద్దరి కలయికయే యీ సృష్టి. తమ రక్తధారలతో కలిగిన, సృష్టిని - ప్రేమతో సాకి రక్షించుకొంటారు.

స్త్రీ మాతృదేవత. ఆమె ప్రేమ విశ్వవిశాలము. అందుచేత ఆమె అంతర్జాతీయదృష్టి నలవరచుకోవాలి. నిస్సహాయత, నిస్పృహ - స్త్రీ శక్తిస్వరూపానికి విరుద్ధము కనుక - నేటి భారతిలో నిస్పృహ గర్భితమైవుంటే - క్రొత్త ఆశను - నూతన విశ్వాసమును - మాతృమూర్తి రేకెత్తించాలి.

"నియతంకురు, కర్మత్వం
కర్మజ్యా యోహ్యా, కర్మణః"

"నీనియత ధర్మాలను పాటించు - నిష్కర్మకంటె కర్మ ఉత్తమమైనది" అన్న సుడులపాటించి భారతజనని దనవిజయా రావమును ప్రపంచమునకు నెలుగెత్తి వినిపించాలి.

"పగరకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకులెందుఁ".

అని హెచ్చరించిన ఖడ్గతిక్కనసతి పలుకులకు పదును గూర్చాలి. ఎవని నామమాత్రాన ప్రాణులు తల్లడిల్లునో, ఎవని రూపమున కలరి జీవులు భీతిల్లుదురో అట్టి కాలభయంకరుడు - యముని సహితము ధిక్కరించి, వరముల బడసినసతి, సావిత్రిచే నిరూపింపబడినది.

శక్తి, ప్రేమ స్వరూపములను - భారతజనని మదికి తెచ్చుకోవాలి. నారి శక్తిస్వరూపిణి - ప్రేమ స్వరూపిణికూడా ! అని నిరూపించాలి.

ఏ జనని 'ఛత్రపతి శివాజీ'ని సృజియించెనో, ఏ జనని శాక్యముని, గౌతముని దిద్దెనో, ఏ జనని, భారతాధినేత, మన గాంధిని, తన హస్తపు టుయ్యాలల నాడించి, మనకై పంపెనో, అట్టి, శక్తి, ప్రేమ స్వరూపిణులగు తల్లులు - మాతృలోక మకుటపు రాళ్ళుగాదా !

ఆమె ప్రేమ స్వరూపం - లేదా ఆమె మాతృస్వరూపం - నిత్యజీవితానికి సంబంధించిన ప్రతి స్వల్ప ఘట్టంలో సయితం మనకు ద్యోతక మవుతుంది.

మాతృహృదయము శమదమాది నిలయము. ఒక వంక నవనీత సమము - మరోవంక కఠిన శిలా వేదిక; రెండు విపరీత గుణముల కూడిక; బిడ్డల ప్రేమించుకొనే పట్ల నవనీతము - రక్షించుకొనే తఱి శిలావేదిక. ఇదిచూస్తే - సృష్టిమూలమే వైరుధ్యంకాదా ? అనిపిస్తుంది.

"వెలుగు ననుసరించి చీకటి, జీవితాన్ని వెన్నంటి మృత్యువు, ప్రేమగర్భంలోనే ద్వేషమనే శిలావేదిక, ఇవన్ని పరస్పర విరుద్ధాలే" - అందుకు మాతృహృదయమే పునాదిగా గోచరిస్తుంది.

ఆ మాతృహృదయము - అనుభవైక వేద్యమేగాని, వర్ణింప శక్యమా !

ఆ తల్లి - ఆ బక్క చిక్కిన పచ్చిబాలెంతరాలి యెదలో - తడియారని, దనబిడ్డపై, వున్న మమత లోతు దెలియతరమా ! దానికి మరియొండు సరితూగునా ! ఆమెకే గ్రాహ్యంగాని యితరులకు దెలియదు.

కడుబడలినతల్లి - కడుపుకోరకు కుమిలి కరిగిపోతుంది. బిడ్డ కావుకావుమను రణగొణధ్వనికి, మైమరుస్తుంది కూనకు రూపురేఖలు దిద్దుకొని స్పర్శసుఖములో నోలలాడుతుంది.

తడియారని తనబిడ్డ మునివేళ్ల గిలిగింతల పునుగు కులుకుల తాకిడికి ఆ తల్లి హృదయంపొంగి, ఆనంద భాష్పాలు రాలుస్తుంది; రొమ్మిచ్చి కుడిపిస్తుంది.

బిడ్డనుగాంచి, సేదదేరిన, ఆ మాతృహృదయాంబుధిలోని ప్రేమజలంపొంగి పొరలుతుంది. పొరలి, మానస సరోతటములుదాటి, మానవలోకమున వరదలైపారుతుందా ప్రేమప్రవాహము. అదిపారిన మానసక్షేత్రములు శాంతినిలయములుగా మారుతాయి. దయా, కరుణ, సస్యములు పండి, సౌఖ్యము - ఆనందము యిచ్చి, జీవులకు - జీవనాధారములవుతాయి.

మమతదెలియని బుడుతకు మెరులుగొలిపి, మరకలేని ఆ తల్లి ప్రేమమధువు కూనకొలకు నురుగుదేలి, కరుడుగట్టి - ద్వేషంగాకూడ మారుతుంది. దినములుగడిచి కదులు బిడ్డకు గాలిమేడలుగట్టి - పూలపాన్పులమరించి, వాని భావిజీవిత వీధిలో విహరిస్తుంది. చెంతనిడుకొని కసరుకొసరులతో - కనుచూపుల కొరడాలతో చనువిచ్చి దరిజేర్చక మురిపాలతో మునిగిపోతుందాతల్లి. కడుపునిండిన బాలను ప్రక్కనిడికొని వాని భావిజీవిత వీధిలో పయనిస్తుంది. మురిసిపోతూ బిడ్డడు బండాడి ముందుకు సాగుతుంటె, రుధిరముప్పొంగి, ముద్దుగొని, రణముగెలిచిన శూరుని - జననిపోల్కి కనుమరుగున దృష్టిలో కదలిపోతూంది. అలరి, మనసులో ఆ యమ్మ ఆటలాడుకొంటుంది.

కాలగర్భములోని పొరలుజారి, పరుగులిడు తనబిడ్డకు కుసుమకోమలి ఆ తల్లి కూర్చుండి బోధిస్తుంది, రణరంగనీతులు.

మురిసి తరలెడి ముసలిమాత, చావులో మునుగుతూ తేలుతూ మూడులోకాలను బిడ్డకై కట్టిపెట్ట జూస్తుంది. ఆ అవ్వ అలుకనెరుగని మమతదెంతో!

కన్నతల్లి, ప్రసవవేదనకు గురౌతుంది. అ వేదన అనుభవించితే దెలియవలసిందేగాని, మాటలకందదు.

“పచ్చిబాలెంతరాలు మా భరతమాత, మాతలకుమాత, సర్వసంపత్ సమేత” అన్న కవిశేఖరుని పసిడిపలుకులలోని, పచ్చిబాలెంత అన్నశబ్దములోని ఆ వేదన, ఆయమ్మబడ్డశ్రమ - ఎంతనివ్రాస్తె తీరుతుంది.

“మా హమ్‌కో జన్మదియా” అన్నవాక్యములోని, మాశబ్దము మమతను యేమని కొనియాడగలము. ఒక్క పలుకులో, “అమ్మ” అన్న శబ్దములో, యిమిడిపోయిందాజనని పడినవేదన.

మాతృహృదయమనే లత చిగురించి మొగ్గదొడిగిన ఫలితమేమొ! ప్రేమమధువు కురియిస్తుంది. సర్వజీవులకు - ఆహ్లాదం కలుగుతుంది.

ప్రసవవేదనబడు ‘తల్లి’కి యీ ప్రేమే - ఆరనిజ్యోతి. బిడ్డపై ‘మమత’ అనేదే లేనిచో అగునా జీవాలు - సాగునా సృష్టి.

పిపీలకాది బ్రహ్మపర్యంతమునుగన్న యీ విశ్వమే - ఒకమాత. ఆ విశ్వమే - మాతలకుమాత. ఆ యమ్మగన్న - పక్షి సంతతిని పరికిస్తె - మాతృహృదయము కొంత అర్థమవుతుంది. విశ్వజనని, కరుణించిన ఫలితంగా - నవయౌవనారంభము - నూతనచైతన్యము - గువ్వల గుబగుబలు - చెట్లచిగురింపులు నవయౌవనుల రమ్యాలు - మొదలిడుతాయి.

పక్షిసంతతిలో పరమసరళస్వభావిగువ్వ. గూడుకట్టి - గ్రుడ్లుపెడుతుంది. పిల్లల్నిజేస్తుంది. లక్షలాదిజీవుల్ని తన బిడ్డలకై బలిజేస్తుంది. ఆ మాత పాపమని తలచదు. వేటలో మైమరచిన ఆ జననికి

కూనలు గుర్తుకొస్తాయి. కలవరుతూ గూడుజేరుతుంది. ముక్కున మోపెడు పురుగులు - గూట్లో గుంపెడు సంతానము. కష్టమనితోచదు. పిల్లలు - మేత - ఇదేచింత, దివారాత్రులు.

కరకు కిరాతుడు - కనిపెట్టి కొట్టవస్తే - వింటినారిధ్వని వినియు - విననట్లు - బిడ్డలకు దనరెక్కలు గప్పి - భీష్మించి - కూర్చుండి, రక్షించుకో జూస్తుంది. ఆ తల్లి హృదయంలోని ప్రేమకు లెక్కలుగట్ట తరమా!

మాతృహృదయమునుగూర్చి దెలియవలెనన్న - గోమాతను గూర్చి జెలియాలి. సాధుమూర్తి గోమాత. గంగగోవు - పరమశాంతమూర్తి. తడియారని తన బిడ్డను - నాకికొను - సమయంలో - కన్న కూతురుగా తన్నుసాకిన కాపును - సహితం, అరచికొరుకుతుంది; దూకిపొడుస్తుంది. అప్పట్ల ఆ యమ కెంరలు - ఆ తల్లి హృదయములోని బిడ్డపైని మమత, ఎంతని, యేమనివ్రాస్తె సరిపోతుందో ?

సృష్టిలో మాతృహృదయమునుగూర్చి - మనము దెలిసికొనగోరితే - పాఠకులు - వారివారి మాతృహృదయములను వొకపరి పరికించగోరుతాను.

ప్రేమభరితమైన మాతృహృదయము - విప్పారి, వికసించి, మానవసంతతికి, మేలుజరుగవలెనంటె అందుకు, తగుమైనవిద్య - సంస్కారము - స్వేచ్ఛ - ఆ మాతృమూర్తికి కలుగజేయాలి.

ముఖ్యంగా - భారతజనని తన సంతతికి, వుపకరించి, దేశము - సుభిక్షమై - ముందుకుసాగి పోవలెనంటె - హైందవనారిని, శక్తి, ప్రేమ స్వరూపిణిగా గుర్తింపజేయవలెను. ఆ నాడే స్వాతంత్ర్యము సార్థకమవుతుంది. నాటిదేశాలలో సరితూగుతూ - మానవాభ్యుదయము దరికి తరలిపోతుం దీదేశము.

"కన్నకడుపే
కన్నీరు గార్చుచో
కల్లోల మీలోకము."

అన్నే నాగమణీదేవి.

# ఆహారసమస్య

నెహ్రూ ప్రధాని.

విలాసాలు లేకుండా గడపగలం; తిండి లేకుండా గడపలేము. మనకు కావలసినంత ఆహారపుపంటలు పండించకపోతే ఇతరదేశాలమీద ఆధారపడాలి; అది పొసగదు. అందుచేత 1951 తర్వాత ఇతరదేశాల నుంచి గింజ తెప్పించరాదని నిర్ణయించుకున్నాము. ఈ సంవత్సరం- మనకు కావలసిన ఆహారధాన్యాలలో 10% మనకు లోటు. ఇందులో కొంతభాగం అతివృష్టి, అనావృష్టివల్లకూడా కలిగింది. ఈ సమస్యతీర్చను మేము 1951 నాటికి 15% పంటవృద్ధి కావాలని కోరుతున్నాము. అది అసాధ్యం కాదు. ఆహార ధాన్యాలకు తోడు- దాని ప్రత్యామ్నాయా పనికివచ్చే ఇతరపదార్థములనుగూడా పండించి తినడం నేర్వాలి. అట్టివానిలో చిరుగడదుంపలు, అరటిపండ్లు ముఖ్యమైనవి. వీనినికూడా తినడంచేత ముఖ్యమైన ఆహారధాన్యములగు గోధుమ, బియ్యం ఖర్చుతగ్గుతుంది. ఈ విషయంలో మనఅలవాట్లను దేశక్షేమార్థమై కొంచంమార్చుకోవాలి. ఇంగ్లాండులో యుద్ధకాలంలో వారలా మార్చుకున్నారు; ఉత్పత్తికూడా 20% హెచ్చుచేశారు. కాబట్టి ప్రతివారున్నూ చిరుగడదుంపలు, అరటిపండ్లు పండించండి. పూలంటే నాకిష్టం; చూడడానికందంగా ఉంటాయి. అయితే నేడు నాకు పూలగుత్తి చూడడంకన్నా అరటిపండ్లగెల చూడడం ఎక్కువ ఆనందంకరం. గోధుమ, బియ్యం- ఈ రెంటిలోను బియ్యంతినడం బాగా తగ్గించుకోవాలి. విదేశాలనుంచి బియ్యము, గోధుమలు రెండూ తెప్పిస్తున్నాము. గోధుమ ఖరీదుకంటే బియ్యంఖరీదు రెండురెట్లుక్కువ. అవి తినడం తగ్గించుకుంటే ఆమేరకు రెండురెట్లు గోధుములు తెప్పించుకోవచ్చు. అయినా- నాటికినాటికి బియ్యమే హెచ్చుగా తెప్పించవలసివస్తున్నది. 1945 మొదలు 1948 వరకు వరుసగా 70 వేలు, 331 వేలు, 454 వేలు, 800 వేలు- టన్నులు బియ్యం తెప్పించాము. మనదేశంలో 200 లక్షల టన్నుల బియ్యం పండిస్తున్నాము. కాబట్టి ఇంత హెచ్చుధర పెట్టి మనం తెప్పించే 8 లక్షల టన్నులు మనకవసరమైనదానిలో 24-వ పాలు. ఆమేరకు మనం ఇతరపదార్థములను ఆరగించడము నేర్చుకుంటే - అది మనవిషయంలో స్వల్పత్యాగం; దేశవిషయంలో ఆర్థికంగా యెంతో లాభం. అరగపట్టిన మిల్లుబియ్యం తెల్లగా అందంగా ఉంటాయి; కాని బలకరం గాదు. కాబట్టి దాన్ని మానండి ఆహారపదార్థాలు దుబారా చేయరాదు; విందులకు విచ్చలవిడిగా వెచ్చించరాదు. ప్రతిగింజకు పాతర్లాడే రోజుల్లో విందులా? పట్టప్పుడు ఆడంబరముగా అన్నం వెదజల్లడం మోటుతనం; ఇలాంటప్పుడు అది మహానేరము.

శ్రీ రాజాజీ

మనము అమాంతంగా గోధుమలు బియ్యం హెచ్చుపండించజాలము. అట్లని- వరిధాన్యం హెచ్చు పండించడానికి అవకాశమిచ్చే ప్రాజక్టులు ఏర్పడేదాకా చేతులుకట్టుకొని కూచోజాలము. వీలైనంతవరకు ఇతర ఆహారపదార్థాలు పండించుకోవాలి. ఇంకాఎక్కువగా జొన్న మొదలైన ముతకధాన్యాలు కాయధాన్యాలు పండించవచ్చు. కోళ్లను పెంచి గ్రుడ్లయుత్పత్తివృద్ధిచేయవచ్చు. చెరువులలో, దొరువులలో చేపలు పెంచవచ్చు. తోటల్లో దొడ్లల్లో పండ్లు, కాయగూరలు పండించవచ్చు. ఇన్నివిధాలా అధికాహారం పండించవచ్చు. నేడు కూలి నాలివాళ్లకున్నూ హోదావృద్ధి అయింది. అందుచేత అంతా ఇప్పుడు బియ్యమే తింటున్నారు. కాబట్టి బియ్యానికి లోటుతోపాటు గిరాకీ హెచ్చినది. ఇప్పుడు వరి హెచ్చు పండించడం సాధ్యంకాదు. కాని జొన్న మొదలైన ముతకధాన్యాలు పండించగలము.

అందుచేత రాగి, జొన్న, మొక్కజొన్న తినడం నాజూకు అనేమాట పుట్టించాలి. పైతరగతులవారు చేసేదిగాని నాజూకనిపించుకోదు. కాబట్టి జైళ్లకుపోవడం, హరిజనులతో కలిసి మెలిసి తిరగడం, రాట్నం వడకడం, గాంధీటోపీధరించడం లాంటివానివలెనే ముతకధాన్యం తినడంకూడా గొప్ప-అనే భావము వ్యాపింపచేయాలి. ఈపని గొప్పవాళ్లుచేస్తే గొప్పఅనుకొని ఇతరులూ వారిననుసరిస్తారు. ఈవిధంగా బియ్యం గిరాకీ కొంత తగ్గింపవచ్చును.

# హరిజనలక్ష్మి

శ్రీ ఆర్. జనాబాయినాయుడు గారు

వెంకన్న, గుడిసెలో మూల్గుతూ అబ్బా! నాచేతగాదమ్మా! తల్లీ! లక్ష్మీ! నిన్ను నేను ఒంటరిగా విడిచి పోవలెనమ్మా! నా తరువాత నీగతి యెట్లానమ్మా అంటూ ఒక అమావాస్యరాత్రి గాఢనిద్రలో వున్న తనప్రియమైనబిడ్డను దగ్గరకిలాక్కుంటూ గొణుగుచుండెను. పాపం!! లక్ష్మికి యేమీ తెలియదు. మంచినిద్ర. వెంకన్న ఒక పొలముకాపు. తనభార్య మల్లమ్మ చనిపోయి ఆరునెలలు. అనేకవిచారము. పొలము పనితానే చూడవలయును. తానేవండుకొని తినవలయును. విశ్రాంతిలేక యింతపనిచేసినా తన ఆత్మకు శాంతిలేదు. చాలా కష్టముగా ఆరునెలలుగడిపి, ఇకయీప్రపంచ జీవితము చాలుననుకొని రాత్రి 12 గంటల సమయమున తన శరీరమును విడిచి విశ్రాంతి కొరకు పరలోకమునకు వెళ్లెను.

పాపము లక్ష్మి తెల్లవారి లేచి చూచుసరికి వెంకన్న లేడు. 'అయ్యా! ఓ అయ్యా!' అంటూ ఏడ్చుచూ కూర్చున్నది. ఒకప్రక్క ఆ చిన్నప్రాణి ఎవరూ దిక్కులేరు. ఇంకొకప్రక్క తను నిన్నప్రొద్దున తిన్న కబళం. ఆరాత్రి అన్నములేదు. మరి ఆకలిబాధ. లక్ష్మి ఒకటే యేడుపు. ఇదంతాచూచి యిరుగు పొరుగు వారు గుమిగూడి వెంకన్నశవముదహనము చేసినారు. ఆపూట యింటిప్రక్క అవిడ లక్ష్మికి ఒకరొట్టె యిచ్చినది. ఆరొట్టితిని లక్ష్మి ఆపూట ఆకలిబాధ తీర్చుకున్నది. ఆరాత్రి ఆపసిది యేడ్చి ఏడుగంటలకే నిద్రపోయింది. కాని అన్నముతినకనే లక్ష్మి నిద్రపోయిందని విచారించువారు లేరు. లక్ష్మికి తెల్లవారుఝాము అయిదుగంటలకే మెళకువ వచ్చింది. నాకు యివ్వాళ్ల భోజనము ఎట్లాగనుచు ఆ చిన్నదాని మనస్సు తటపటాయించింది. ఇంతలో గుడిలోగంట గణగణ మ్రోగింది. అదివిని 'ఆఁ ఇవ్వాళ్ల సోమవారము. శివాలయములో పూజ' అని ఆబాల మనస్సు అటుపోయింది. తొందరగాలేచి ఒకేపరుగు శివాలయము వంక తీసింది మనలక్ష్మి. పిల్లలు కొందరు గుంపులు గుంపులుగానిలుచొని ఎవరైనా కొబ్బరిముక్కలు పంచిపెట్టెదరేమో యని నిలుచున్నారు. వారిలో మనలక్ష్మి గూడా నిలుచున్నది. ఇంతలో కరణంగారి యిల్లాలు భాగీరథి పూజాద్రవ్యములను తీసుకొని దాసీదానిని వెంటబెట్టుకొని దేవాలయములోనికి పోయింది.

సుశీలగూడా ఒక ఉత్తమ యిల్లాలు. ఆమెగూడా పూజకొరకు దేవాలయములోనికి వచ్చింది. ఆమె తనుకొట్టిన కొబ్బరిముక్కలు పంచుకుంటూ పోసాగెను. అదిచూచి మనలక్ష్మి ఆమెవద్దకు పరుగెత్తుచుండెను. ఆతొందరలో తనచెయ్యి భాగీరథి పైటకు తాకెను. ఇంతలో భాగీరథి మండిపడి 'పాపీ! చండాలీ నన్ను తాకినావు. నన్ను మైల పడేసినా' వంటూ, 'తనదాసీదానితో' 'దానినెత్తిన మోదవే' అని ఒక ఉత్తరువు జారీ చేసెను. అంతేచాలని ఆదాసీది తనపూజకుతెచ్చిన కొబ్బరికాయ లక్ష్మినెత్తిమీదనే కొట్టెను. లక్ష్మితల పగిలి రక్తముకారుచుండెను. లక్ష్మితల ఒకచేతితో పట్టుకొని 'మహాదేవా!' అంటూ ఒకమూలకూర్చొని ఒరుగుచుండెను. అదిచూచి సుశీల లక్ష్మివద్దకు పరుగెత్తినది. 'ఆహా! ఎంత అన్యాయము! ఎంతపాపము! అంతారక్తము' అంటూ లక్ష్మితల ఒకచేతితో పట్టుకొని సంగతితెలుసుకొనెను. తనకుచాలా విచారము వేసెను. వెంటనే లక్ష్మిని తనయింటికి తీసుకొనిపోయెను. సుశీలయింట్లో పెద్దలెవరూ లేరు. సుశీల, ఆమెభర్త సుందర్ మాత్రమే ఉన్నారు. ఆమెయీకథంతా సుందర్‌తో చెప్పెను. 'అదివిని సుందర్ సుశీలా! చూసేవుకదా! ఈ అంటరాని తనముతో మనసంతానాన్ని మనమే బాధపెట్టుచున్నాము. అయినను మనమిద్దరమీవిషయములో తప్పకుండా కంకణము గట్టుకొందము' అన్నాడు. అదివిని సుశీల 'మీరు నాకు సహాయము చేసిన నేను లక్ష్మినే ఉదాహరణముగా ప్రపంచమునకు చాటెదను.' అనెను. సరేసరే ననుకున్నారు.

మరుసటిదినము లక్ష్మిని బడికి పంపినారు. లక్ష్మిగూడా చాలా శ్రద్ధగా చదువుచున్నది. ఒక్క సంవత్సరం గూడా తప్పకుండా పరీక్షలలో నెగ్గుతూ వచ్చింది. మెట్రిక్యులేషన్ పరీక్ష నిచ్చింది. ఆమె

కిప్పుడు పదహారేండ్ల వయస్సు. యవ్వనము తొంగిచూచుచున్నది. లక్ష్మి చాలా అందమైనపిల్ల. ఆరోజు పరీక్షాఫలితాలు. సుందర్ పేపరు పట్టుకొని మహావేగముగా వచ్చి, సుశీలా! చూచావా! లక్ష్మి మొదటి తరగతిలో నెగ్గిందన్నాడు. అదివిని సుశీల నామనస్సుకతోచినట్లు మనలక్ష్మి చదువుతుంది. అని ఆపుణ్యదంపతులు లక్ష్మిని పిలిచిరి. లక్ష్మి చెట్లకు నీరుపోయుచున్నది. సుశీలపిలువగానే పరుగెత్తుకుంటూ వచ్చింది. సుశీల లక్ష్మికి పరీక్షా ఫలితములసంగతి చెప్పెను. అదివినిలక్ష్మి ఆనందించెను. సుశీల లక్ష్మితో ఇకనీవు పెళ్లి చేసుకో. మంచిసంబంధము చూచెదను. అని అన్నది. అదివినిలక్ష్మి అమ్మా! నాకు పెళ్లివద్దు. నేనింకా చదివెదను, మరినేను కొద్దో గొప్పో సేవచేసెదను. అనెను. అదివిని సుశీల సంతోషించి చదువుకొమనెను. తరువాత యేడు సంవత్సరములకు లక్ష్మి లేడీ డాక్టరయ్యెను. గ్రామస్థులంతా లక్ష్మిమందే వాడేవారు. దైవకటాక్షముచేత మనభాగీరథికి కూడా గడువు జ్వరమువచ్చెను. గ్రామస్థులంతా లక్ష్మిమంచి మందుయిస్తుందని సూచించిరి. అదివిని కరణంగారు లక్ష్మినితనయింటికి పిలపించి భాగీరథిని చూపెను. ఆమెను లక్ష్మి బహుజాగ్రత్తగా పరీక్షించి మంచిమందు యిచ్చితొందరలోనే ఆమెజబ్బు కుదిర్చెను. తరువాత లక్ష్మిని భాగీరథి ఒకరోజున సాయంత్రము ఫలాహారమునకు తనయింటి కాహ్వానించెను. లక్ష్మితోపాటు తనముఖ్యస్నేహితులను గూడాపిలిచెను. సాయంత్రమునకందరూ వచ్చిరి, లక్ష్మి తలమీద కొబ్బరికాయ కొట్టినదాసీది ఫలాహారము తెచ్చిపెట్టుచుండెను. సకాలమునకందరును వచ్చిరి అందరితోపాటు మనలక్ష్మిగూడా వచ్చెను. అందరినీ భాగీరథి టేబులువద్దకు పిలుచునిపోయి కూర్చొబెట్టెను.

లక్ష్మిమాత్రము దూరముగా నిలుచుండెను. అదిచూచి భాగీరథి అదియేమిటి? మీరు కూర్చోరెందుకు? అన్నది. అదివిని లక్ష్మి మీతో నే నెట్లుకూర్చోనమ్మా! నేనెవరనుకున్నారు? ఆరోజు శివాలయములో మిమ్ములను తాకినలక్ష్మిని అనెను. అదివిని భాగీరథి తానుచేసిన పనికి మిగుల సిగ్గుపడి లక్ష్మిని క్షమార్పణ కోరెను. దానికి ప్రతిఫలముగా రాష్ట్రపిత గాంధీమహాత్ముడు హరిజన సేవచేసిన విషయమును, హరిజనులకొరకు ఆయనచేసిన ఉపవాసములు - హరిజన దేవాలయ ప్రవేశమును గూర్చి విపులముగా లక్ష్మి భాగీరథికి తెలిపెను. అప్పటినుండి భాగీరథి మహాత్ముని పటమునకు రోజూ ప్రణామము చేయుచుండెను. హరిజనుల యెడల తానుచేసిన ద్రోహమును, సుశీలచేసినమేలును మనస్సులో తర్కించుకొనుచుండెను. కావున ప్రతిస్త్రీ తానుచేయు ప్రతిపనికి ముందుఫలితమును యోచనచేయవలయును.

# పాపాయి ★ బాపూజీ!

శ్రీమతి సా. చిరంజీవిగారు

నీనవ్వు కివ్వొచ్చు నిలువు దోపిళ్లు
నవ్వరా పాపాయి! నవ్వు చిరునవ్వు!

ఒడలి నిండా బట్టలుంచ వొకసేపు
మొలగుడ్డ మాత్రమే ముద్దు లాలికేని!

ముక్తసరిగా మూడు ముక్కలంటావు
తొక్కుపలుకుల పాప, తూచి బాపూజీ!

దాపు మాపూ లేదు తథ్యమే పలుకు
పాపాయి చిరునోట, బాపూజీ మాట!

పాపాయికెల్ల బంధువులె జగతి
శత్రువుల యెదుటకే చక్కపోతావు!

నీ యాస్తి ఒక వాచి నికెలు జోడద్దాలు
పాపాయికీ యాట వస్తువులె చాలు!

స్వాతంత్ర్యమున కెంత జతనమ్మొ పాప
తల్లికౌగిలి, జైలు తప్పదా బాపు!

పాపాయి! బాపూజీ! పారతంత్ర్యమ్ము
బాపేటి యత్నాల పట్టగారావు!

నీ వలిగి తినకుంటె నిఖిలదేశాలు
ఊరు వాడా వచ్చి ఒప్పించు నిన్ను!

పాపాయి లంటేను ప్రాణమూ నీకు
వారితో ఆటలకు పరువులిడతావు!

రాచకార్యాలలో ప్రార్థనలు సేతు
బాపుజీ జేజేల పాపాయి వీవు!

పాపాయి చిరజీవ బాపుచిరజీవ
జనకుడై మాజాతి జనకుడై నిలతు!

---

# శాకుంతలమున శకుంతల

శ్రీ మొదలి వెంకట రామయ్యగారు

శృంగారప్రధాన దృశ్యకావ్యమున నాయక పాత్రానుగుణముగ నాయికా పాత్రమును చిత్రించుట యవసరము. నాయికా నాయకుల చేష్టలును, చిత్తవృత్తులు నేకముఖమైననేగాని రసోత్పత్తికవకాశ మేర్పడదు. నాయకుని యథార్థముగ ప్రదర్శించి నాయిక నాదర్శప్రాయగ ప్రదర్శించినను లేక తద్విపరీత పద్ధతిని ప్రదర్శించినను నాటకమునకు పుష్టి కలుగనేరదు. పాత్రీకరణమునందలి సార్థక్యమే యిందులకు కారణము.

శృంగారమునకు స్థాయి "రతి." రతియనగా నాయికానాయకుల కొండొరులయందేర్పడు ననురాగము. భిన్నమనః ప్రవృత్తులుగల స్త్రీ పురుషుల మనస్సు లొండొంటితో కలియవు. ఇట్టివారికి బాహ్యసౌందర్య దర్శనమాత్రమున ననురాగ మేర్పడినను నది చిరస్థాయి గానేరదు. ఇరువురి చిత్తవృత్తులు భిన్నములని తెలియగనే యనురాగము నశించును. కావున "మనస్సంగమమే" రతికి ముఖ్యకారణము. అప్పుడే రతి చిరస్థాయియగును. తుల్యదృక్పథములును, చిత్తవృత్తులునుగల స్త్రీ పురుషుల మనస్సులు మాత్రమే ఒండొంటితో కలియును. కావుననే నాయికానాయక పాత్రములు క్షీరనీరన్యాయమున మిళితములగునట్లు యథార్థముగనో, ఆదర్శప్రాయముగనో - ఏదోయొక రీతినిమాత్రమే - చిత్రింపబడినపుడే నాటకకర్త పరిశ్రమ సార్థకమగును.

నాటకమున శకుంతలాపాత్ర మైదుపరిస్థితులయందు చిత్రితమైనది. ప్రథమాది తృతీయాంకాంతము వరకును అనురాగము. చతుర్థాంకమున పతిగృహప్రస్థానము. పంచమాంకమున భర్తృతిరస్కృతి. షష్ఠాంకమున ప్రవాసము. సప్తమాంకమున భర్తృసమాగమము.

శకుంతల దైవాంశయు, మానుషాంశయు గలసినయొక ప్రత్యేకనాయిక. బాల్యమునుండియు కృత్రిమమైన నాగరక సంసర్గములేని శాంతమగు తాపసాశ్రమమున వల్కలధారిణియై ముగ్ధావస్థయందు పెరిగినది. నిరలంకారయయ్యు సహజ సౌందర్యఖనియై చూపఱులహృదయము నాకర్షించుచుండెడిది. అనవరత వేద పఠనమున జడులై ప్రపంచజ్ఞాన శూన్యులగు నాశ్రమవాసులను తనజిలిబిలి పల్కులచే ముగ్ధులనుజేయుచు హోమధూమ సంఛాదితమైన యాశ్రమపదము నాత్మీయసహజ శరీరకాంతిచే నుద్దీపింప జేయుచు కణ్వుని బహిఃప్రాణమై, తక్కంగల తాపసులచే బహుమానితయై వృద్ధి పొందినది. సమవయోరూప రమణీయలగు సఖులతో వనలక్ష్మివలె విహరించు యౌవనవతియగు నాలావణ్యరాసి, కృత్రిమ నాగరకవాసనల కాటపట్టులనదగు శుద్ధాంతాంగనల సంసర్గమున విసిగియున్న దుష్యంతుని మనస్సు నాకర్షించుటలో వింత యేమున్నది? అనాఘ్రాత పుష్పము మకరందమునకు తావలముగాన మధుకరమాశ్రయించుట యుచితమేగదా!

కాళిదాసీపాత్రమును పోషించుటయందు తనకళాప్రౌఢిమనంతయు వినియోగించెనని చెప్పవచ్చును. తాపసాశ్రమమందు పెరిగిన బాలికగావున లోకవిషయానభిజ్ఞతయు, ముగ్ధ్యము ననునవి యీపాత్రమున నుండవలసిన ముఖ్యలక్షణములను నభిప్రాయమున నీపాత్రమును నాటక ప్రారంభము మొదలు నాటకాంతమువరకును ముగ్ధగనే చిత్రింపక, ప్రథమమున ముగ్ధగనే ప్రదర్శించి అనురాగాభివృద్ధి ననుసరించి క్రమక్రమముగ నామౌగ్ధ్యమును తొలగించి ప్రౌఢనొనర్చినాడు. యౌవనవతులగు స్త్రీలు త్రపావృతలై ప్రథమమున తమహృద్గత భావముల ప్రదర్శింప జాలకున్నను క్రమముగా లజ్జనువీడి భర్తృహృదయమును చూఱగొనుటకు ప్రయత్నింతురు. "జాతిబొమ్మకు చక్కిలిగింత" లేనట్లు నాటకమందంతటను ముగ్ధగా చిత్రింపబడు నాయికయందు శృంగారరస ముత్పన్నమగుటయు, వృద్ధినందుటయు నెట్లుసంభవించును? ఈ రహస్యమును గ్రహించియే కాళిదాసు తననాయికను క్రమక్రమముగ ప్రౌఢనొనరించెను.

ఆశ్రమాచారము లగుర్తించి తదనుసారముగ ప్రవర్తించునది గావుననే యతిథిపూజనమున కామెను నియోగించి కణ్వుడు సోమతీర్థమునకేగెను. కులపతి యాశ్రమముననే యుండుట తటస్థించుచో దుష్యంతున కాతిథ్య మొసగి తన స్వేచ్ఛాలాపములతోను, ముగ్ధ విలోకనములచేతను, అతని మనస్సు నాకర్షించుటకును, అతని ప్రేమకు పాత్రయగుటకును శకుంతల కవకాశ మేర్పడదు. కావున కణ్వుని యసాన్నిధ్యమును పురస్కరించుకొని దుష్యంతుని యాశ్రమమున జేర్చినాడుకవి.

శకుంతలస్వయముగ నీటినిమోసి తెచ్చి యాశ్రమవృక్షముల పెంచినది. వానియందు సోదరీ స్నేహముంచి తదభివృద్ధినిగాంచి సంతసించు నిష్కళంక ప్రేమపూరితహృదయ. వేయేల?

"పాతుం నప్రథమం వ్యవస్యతిజలం యుష్మాస్వపీతేషు యా
నాదత్తే ప్రియమండనాపి భవతాం స్నేహేన యా పల్లవం
ఆద్యే వః కుసుమప్రసూతి సమయే యస్యా భవత్యుత్సవః"

అను కణ్వుని పల్కులే ఆశ్రమ వృక్షములయెడ నామెకుగల యవ్యాజవాత్సల్యమును వ్యక్త పరచుచున్నవి.

"ఏషవాతేరిత పల్లవాంగులీ భిస్త్వరయతీవమాం కేసరవృక్షకః; యావదేనం సంభావయామి" యను నామె మాటలచే, శకుంతల వృక్షములయందు మానుషత్వము నారోపించుకొని వానితో సల్లాపించుచుండు ననియు నూహింపవచ్చును.

ఆశ్రమవాసినియైనను, యౌవనవతియగుటచే సహజమగు మన్మథ వికారము లేకుండునా? రమణీయే ఖలు కాల ఏతస్యలతాపాదపమిథునస్య వ్యతికరస్సంవృత్తః; నవకుసుమ యౌవనా వన జ్యోత్స్నా; బద్ధపల్లవతయోపభోగక్షమస్సహకారః" యని తన హృద్గతభావమును లతాపాదపవ్యాజమున వ్యక్తావ్యక్తముగ సూచించినను, "యథావన జ్యోత్స్నాను రూపేణ పాదపేన సంగతా, అపినామఏవ మహమపి ఆత్మనో నురూపం వరంలభేయేతి" యని యామె మాటలయందలి భావమును విస్పష్టపరచుటకు ప్రియంవద గలదుగదా! లతాపాదపమిథునమే శకుంతలయొక్క మనమున వికారముదయింపజేసి నాయికానాయకుల పరస్పరానురాగమునకు ప్రథమ భిక్ష పెట్టినది. కావుననే కణ్వుడు—

"సంకల్పితం ప్రథమ మేవమయా తవార్థే
భర్తారమాత్మసదృశం సుకృతైర్గతాత్వమ్
చూతేనసంశ్రితవతీ నవమాలికేయ
మస్యామహం త్వయిచ సంప్రతివీతచిన్తః"

యని శకున్తలా వనజ్యోత్స్నలను గాంచి హృదయభార మపనయించుకొనెను.

లతాపాదపమిథున దర్శనమున వికారమునకులోనైన శకుంతలయొద్దుట, నామెయూహలను సార్థకము జేయుటకో యనునట్లు నవమన్మథాకారుడగు దుష్యంతుని నిలుపుట సముచితముగదా! నాగరిక ముఖమును జూచి యెరుగని శకుంతలయాతని దర్శనమున లజ్జితయై యాతిథ్యమునొసగుటగూడ మరచినది. అందులకు

"కింను ఖల్విమంజనం ప్రేక్ష్య తపోవన విరోధినో వికారస్య గమనీయాస్మి సంవృత్తా?" అని యామెయే సమాధానము చెప్పుచున్నది. ఇదియే దుష్యంతునియందామెకు గల్గిన యనురాగమునకు బీజము. ఇంతవరకు ముగ్ధగ చిత్రింపబడిన శకుంతల యెట్టిక్రమ పరివర్తనమునకు లోనైనదో గమనింతము.

"కోనుఖల్వేష చతురగంభీరా కృతిర్మధురమాల పన్ప్ర భావవానివలక్ష్యతే" యను తర్కము ప్రియంవదకేగాక శకుంతలకుగూడ కలిగినది. ఆమె దుష్యంతుని యాకారము నేగాక హృదయమార్దవమును, ప్రభావత్త్వమునుగూడ ప్రేమించినది. ఇరువురి మనస్సులును కలసినవి.

దుష్యంతునియందు గాఢమగు ప్రేమను గలిగియుండియు "యద్యత్రాద్య తాత స్సన్నిహితో భవేత్" అను సఖీజన పరిహాసవాక్యములు శ్రవణానందకరములుగనున్నను - సఖులయెడ నలీక క్రోధమును ప్రదర్శించుటయు, తన వృత్తాంతమును దుష్యంతునకు వినిపించువారిపై కినిసి ప్రస్థితయగుటయు ప్రౌఢతాసూచక లక్షణములు. వృక్షసేచనా సక్తయై నిర్వికార చిత్తముతో విహరించు తాపసకన్యక - రాగోదయమగుటయే తడవుగ - అలీకక్రోధ ప్రదర్శనమునను, శృంగార చేష్టలచేతను నాయకుని విభ్రాంతునొనరించినది. వనగజ వృత్తాంతమున భయభ్రాంతలై యుటజమున కేగునపుడు ఒకానొక వ్యాజమున వెనుదిరిగి యామె దుష్యంతునిపై బఱపిన సానురాగవీక్షణమే యాతనిమృగయాసక్తిని నశింపజేసి "మందోత్సుకోస్మి నగరగమనంప్రతి" యనునంతటి దుర్బలుని జేసినది. కడకు దేవ్యాజ్ఞనుగూడ తప్పించుకొనజేసి ఇష్టివిఘ్న నివారణమను మిషచే యాతని నాశ్రమము వైపునకే లాగినది.

జన్మాంతర సుకృత విశేషఫలమనదగిన శకుంతలయను నీయనన్యసామాన్య సుందర పదార్థమును కవి యందరకందుబాటుగనుంచెనా? లేదు! గూఢమును, దాహాత్మకమునునగు తేజముగల తపోధనునియందనుంచెను. దుష్యంతునంతటి మహారాజుగూడ నా పదార్థమును దూరమునుండియే గాంచి—

"చిత్రే నివేశ్య పరికల్పిత సత్త్వయోగా
రూపోచ్చయేనమనసా విధినా కృతాను
స్త్రీరత్నసృష్టిరపరా ప్రతిభాతి సా మే
ధాతు ర్విభుత్వ మనుచింత్య వపుశ్చతస్యాః"

అని యాసౌందర్యమును మనసా భావించి యుపాసించెనేగాని సమీపించుటకుగాని, స్పృశించుటకుగాని సాహసింపడయ్యెను.

వివృత్తవదనయై శకుంతల ప్రసరింపజేసిన ప్రేమపూర్వక వీక్షణము దుష్యంతుని గ్రీష్మాతప వేళయందు మాలినీ తీరమంతయు కలయ త్రిప్పినది. ఆ దృష్టియందెట్టి మధురభావము కిమిడియుండెనో! నేత్రసంజ్ఞా మాత్రమున నా ధీరపురుషుని హృదయమును శాసింపగలిగిన యామెయందెంత ప్రాగల్భ్య మిమిడియుండునో యూహింపుడు. (సశేషము)

# సామెతలు

559 ఎగదీస్తే బ్రహ్మ హత్య, దిగదీస్తే గోహత్య.
560 ఎత్తుపడ్డ గొడ్డు, పులికి జడుస్తుందా?
561 ఎద్దు మోసినంత, గోనె పట్టినంత.
562 ఎదటఅన్నది మాట, ఎదాన పెట్టింది వాత.
563 ఎద్దు ఎండకు లాగ, దున్నపోతు నీడకు లాగ.
564 ఎద్దువలె తిని, మొద్దువలె నిద్రపోయినట్లు.
565 ఎప్పటి మెప్పు అప్పటికే.
566 ఎముక లేని నాలుక ఎట్లా తిప్పినా తిరుగుతుంది.
567 ఎరువు సతము గాదు, వాక్కు తోడు గాదు.
568 ఎలుక ఎంత ఏడ్చినా పిల్లి తనపట్టు వదలదు.
569 ఎలుక చావుకు పిల్లి మూర్ఛ పోవునా?
570 ఎలుకమీద కోపాన ఇంటికి చిచ్చుపెట్టుకొన్నట్లు.
571 ఎలుక ఏట్లో పోతేనేమి, పులి బోనున పోతేనేమి?
572 ఎల్లవారమ్మ బ్రతుకు, తెల్లవారితే తెలుస్తుంది
673 ఎవరికొంప తీయడానికి ఈజంగం వేషం వేసినావు?
574 ఎవరుఇచ్చినది ఈమాన్యం అంటే, నేనే ఇచ్చుకొన్నాను అన్నాడట.
575 కుమ్మరి కొకయేడు గుదియకొక పెట్టు
576 ఏకాలం జారినా పిల్లకే మోసము.
577 ఏటిఈతకు, లంక మేతకు సరి
578 ఏట్లో పడ్డవానికి, ఎన్నో యెన్నికలు
579 ఏతాం పాటకు, ఎదురు పాట లేదు.
580 ఏనుగకు కాలు విరిగినా, దోమకు రెక్క విరిగినా సమానమే!
581 ఏమిపోలిశెట్టీ అంటే, ఎప్పటి మొత్తుకోళ్ళే అన్నాడట
582 ఐశ్వర్యమునకు అంతము లేకపోయినా, ఆలోచనకు అంత ముంది.
583 ఒకరికున్నదని ఏడిస్తే ఒక కన్నుపోయింది, తనకులేదని ఏడిస్తే రెండుకన్నులు పోయినవట
584 ఒకనాటి భాగవతముతో మూతి మీసాలన్నీ తెగకాలినవి,
585 కుక్క ముట్టుకొన్న కుండ
586 ఒకనాడు ధారణా ఒకనాడు పారణా
587 ఒక్కప్రొద్దు మాట కుక్క ఎరుగునా?
588 ఒళ్లు వంగనమ్మ, కాలిమెట్టెలకు కంది పోయినదట.
589 ఓర్చిన ఓరుగల్లె పట్టణ మవును.
590 ఓరుగాలిలో దీపము వెలిగించి, దేవుడా నీమాహాత్మ్యమన్నట్లు
591 ఓంకారము రానివాడు వల్లు గుణించినట్లు.
592 ఓపనివారికి వద్దన్నవారే తల్లిదండ్రులు.
593 ఓబీఓబీ నీవు వల్లు దంచు, నేను పక్కలు ఎగురవేస్తాను.
594 అంత్య నిష్ఠురముకన్న ఆది నిష్ఠురము మేలు.
595 ఆంత నాడులేదు, ఇంతనాడులేదు, సంతనాడు పెట్టింది ముంతంత కొప్పు
596 కుక్కను చంపిన పాపము గుడికట్టినా పోదు.
597 ఆంగిటిలో బెల్లం ఆత్మలో విషం
598 అందిన తీపి, అందకున్న పుల్లన
599 కుడవపోతూ కూరాకురుచి అడిగినట్లు
600 కంకణముల చెయ్యిఅడిగితే, కడియాల చెయ్యి ఆడుతుంది.
601 కంటి ఇంపైతే కడుపునకు ఇంపు
602 కండ్లకు దూరమైతే చెవులకు దూరమా?
603 కందకు లేని దురద బచ్చలి కేమి?
604 కక్కిన కుక్క వద్దకీ కన్నకుక్క వద్దకీ కాని వాణ్ణిఅయినా పంపవద్దు.
605 కప్పకు కాటూ బ్రాహ్మణునికి పోటూ లేదు.
606 కళ్లు ముండకు అల్లప్పచ్చడి
607 కుక్క తోక పట్టుకొని గోదావరి ఈదినట్టు.
608 కుక్కలు ఏకులు వడికిన గుడ్డాలు చీరలుకట్టునా?
609 కుక్క కాటుకు చెప్పదెబ్బ

# ఎట్లు వచ్చితి?

మధురకవి నాళము కృష్ణరావుగారు.

"ఎట్లు వచ్చితి? నన్ను నీ వెచటినుండి
తెచ్చికొంటివి? అమ్మరో! తెలుపు" మనుచు
పలుకు పలుకున తేనియ లొలుకుచుండ,
అడిగె నొకనాడు తనతల్లి నను(గుబిడ్డ.

కనుల నానందబాష్పముల్ తొనకియాడ
చిన్నిబాలుని నక్కున(జేర్చి తల్లి
మోవి మోవిని గదియించి ముద్దు గొనుచు
ఇట్లు పచియించె మక్కువ యుట్టిపడ(గ.

"నాదు వలపుల మొలకవై, నా తలంపు
పంటవై, నా తపంబుల ఫలమ వగుచు,
దా(గియుంటివి నాదు డెందంబునందు
ఇన్నినాళ్లును నా ముద్దు చిన్నికూన!

చిన్నతనమున కూర్మి నెచ్చెలుల(గూడి
మంటిముద్దల చిన్నిబొమ్మలను జేసి
వేడుకలు మీఱ నే నాటలాడునపుడు
బొమ్మలను దా(గియుంటివి ముద్దుబిడ్డ!

అనుపమం బగు భక్తి నే ననుదినంబు
ఎలమి గృహదేవతల పూజ సలుపువేళ
దేవతలలోన నీవు మూర్తీభవించి
నిలిచియుంటివి నాదు మందిరమునందు.

యౌవనం బను తొలకరి యంకురించి
మవ్వ మగు నా మనం బను పువ్వుగుత్తి
విరిసి యల్లన రేకులు విచ్చినపుడు,
అంటియుంటివి తావివై యందు బిడ్డ!

నాదు జీవితమునయందు, నీదు కూర్మి
తండ్రిజీవితమున, వాని తల్లిదండ్రి
జీవితంబుల, వేయేల సృష్టి మొదలు
నిలిచియుంటివి యీ యింట నేటిదనుక.

ఆ యనంత తేజోరాశి నవతరించి,
విశ్వజీవన వాహినీ వీచి(దేలి,
నాదు మానస సింహాసనమున నేడు
కట్టికొంటివి పట్టంబు తుట్టతుదకు.

భువనమోహన మైన నీ మూర్తి నేను
కనులపండువుగా(జూడగాంచునపుడు,
నిలువునను నాదు మే నెల్ల పులకరింప
అట్టె భ్రమాస్పడి నిలుతు నీ యెట్టయెదుట.

ముద్దు లొలికెడు నీదు నెమ్మోముదమ్మి
కాంతుల దీఱ నెగాదిగ(గాంచునెడల,
దృష్టి తా(కెడికో యంచు దిగులు జెంది
తేటిపాఱ గ దిలకింప నేర నెప్పుడు.

ఎన్న డైనను నను నీవు కన్ను మొఱ(గి
జాఱి(గిపోదువో గిరురించి యనెడు భీతి
మంజులం బగు నా బాహుపంజరమున
పట్టి బంధించియుంతు నో చిట్టిపట్టి!

---

## ఏదివచ్చినా పట్టశక్యంగాదు అమెరికాలో!

అమెరికాలో శలవురోజుల్లో జనం అతిజల్సాగా గడుపుతారు. ఆరద్దీలో ప్రమాదాలున్ను జరుగుతుంటవి. కొంతమంది చచ్చికూడా పోతారు. మొన్న ఈజులై 4.వ తేదినాడు, ఇలాంటి ప్రమాదాలవల్ల చనిపోయిన వారిసంఖ్య 639. ఇదే ఇప్పటికి గొప్పసంఖ్య. ఇదివరలో 1941-లో ఒకసారి 628-మంది చనిపోయిరి. అప్పటికది గొప్పసంఖ్య. ఈసారి చనిపోయిన వారిలో కారుప్రమాదాలవల్ల చచ్చినవారు 279-మంది. ఆతర్వాత నీళ్లలోమునిగి చచ్చినవారు 229-మంది. అమెరికాలో ఏదివచ్చినా పట్టశక్యంగాదు.




అమెరికాలో సుప్రసిద్ధపత్రికా రచయిత శ్రీ డ్రూపియర్సన్ స్టెర్లింగ్ విలువ తగ్గించడం విషయమై ఇట్లా వ్రాశారు:—

అంతకన్నా, ముసలితండ్రిభారం పడుచుకొడుకు తలకెత్తుకున్నట్లుగా ఇంగ్లాండును మనం పుచ్చేసుకుంటే సరిపోతుంది. ఆసియా వలసరాష్ట్రాలనే పాడిఆవులను పిండుకున్నంతకాలం బ్రిటిష్‌వారు కళకళలాడుతుండేవారు. ఆ వలసరాష్ట్రాలలో జనం కోటానకోట్లు - చాలీచాలని తిండితో పస్తుండడం తరువాయిగా బ్రతుకుతూంటే- సామ్రాజ్యం దుక్కలాబలిసింది. ఇప్పుడో, బ్రిటిష్‌వారు జనం క్రిక్కిరిసియున్న తమదీవులలోనే ఉన్నంతలో సరిపుచ్చుకోవలసిన గతిపట్టింది; స్వతంత్ర సామంతదేశాలు ఏమీ సహాయం చేయడంలేదు. ఆసియాలో పిండుకొని రాగలిగినంతవరకు డచ్‌వారిస్థితి అంతే. వారితరువాతవారు ఫ్రెంచివారు. అయితే వారిచేతిక్రింద ఇంకా ఉత్తర ఆఫ్రికాదేశాలు కొన్ని ఉన్నవి.

భారతయూనియన్ కాన్‌స్టిట్యూయెంట్ అసెంబ్లీ సభ్యురాలైన శ్రీమతి రేణుకరే గారు అఖిలభారత మహిళా మహాసభవారి అర్ధ సం॥ర సమావేశాల్లో అధ్యక్షతవహించి ఇట్లు చెప్పినారు:—

పురుషులతో భుజముభుజము రాచుకొనుచూ సాగిపోవలసిన పౌరులుగా స్త్రీలునుముందుకురికి తమవంతు కృషిని తాముచేయవలసిన తరుణమాసన్నమైనది. మనసంస్థ ఇన్నాళ్లును, స్త్రీలు తమసమస్యలను యెదుర్కొనగల్గుటకయ్యే పని చేసియున్నది. అయితే బాధ్యతలను హక్కులతో జతచేర్చారు. ఇంకా హెచ్చుమంది స్త్రీలవిషయమై పాటుబడవలెనంటే, అట్టిబాధ్యతలను వహింపను సాధ్యమగుటకు ఏమిరక్షణలవసరమో వానినిబడయడంకూడా ముఖ్యము-అని వారికి నచ్చినది. భారతీయులలో బహుళసంఖ్యాకులైన హిందువుల వ్యవహారములకు మూలమైన హిందూలా సవరణ నింతకాలమునుండియు మేముకోరుటకిదియే కారణము.

1940 లో పండిత జవహరిలాల్ నెహ్రూ కాశ్మీరమును దర్శించిన నాడాయనకు కల్గిన ఆనందాతిశయము నాయనయే ఇట్లు వివరించారు:—

ఆప్రదేశముయొక్క సౌందర్యాతిశయము నన్ను వశంచేసుకున్నది. దానికినేను వ్యామోహితుడనై పోయాను. సౌందర్యదేవత నన్నావేశించిందా, సౌందర్యామృతమును తప్పతాగానా, అన్నట్లు అవశుడనైతిరిగాను. అమత్తు నన్నున్మత్తుని చేసివేసింది. వ్యక్తిగతంకానిది, కామవాంఛాతీతమైనది, అయిన జవరాలి మితిమీరిన సొగసువంటిది నదులు, లోయలు, సరస్సులు, తీవిగలచెట్లు, అనువానితో గూడిన కాశ్మీరపుస్త్రైణ సౌందర్యాతిశయము. అంతట ఆఅద్భుత సౌందర్యముయొక్క మరొక్కవిషయం, ద్యోతకమవుతుంది. అందలి కఠినశిలామయ పర్వతపంక్తులు, ప్రమాదకరమైన కొండఅంచులు, మంచుకిరీటాలతో విలసిల్లే పర్వతశిఖరాలు పేరుకొన్న మంచురాసులు, అతివేగంగా క్రిందికిదుమికే దారుణము భయంకరము అయిన సెలయేళ్లు ఇవన్నీ మగసిరి వెలిగ్రక్కుతూంటాయి. దానికి శతముఖములు, సహస్రవైఖరులు, నిరంతర పరిణామము. అప్పుడు నవ్వినట్లుంటుంది; అంతలో దుఃఖాతిశయమున విషాదచ్ఛాయలు ముసురుకొన్నట్లుంటుంది. దాల్ సరస్సుపైనుండే మంచు తెరవిచ్చిపోతూ, వలిపెంపు మేలిముసుగు చాటునుండే సోయగపుఛాయలు తళుకుతళుక్కుమనిపిస్తున్నట్లుంటుంది. మేఘాలు పర్వతశిఖరాలను కౌగిలించుకునే కన్నెలలాగా కన్పిస్తాయి; అంతలో నవి చల్లగా దిగజారుతూ ఆటలమారి బిడ్డల ననుకరిస్తాయి. ఇట్లు నవనవోన్మేషమొనర్చె ప్రకృతిభామను పరికించి పులకించాను. ఒక్కొక్కసారి ఆసమ్మోహనకరమైన దృశ్యాలు నాకొలదికిమీరగా సొమ్మసిల్లి పోయేవాడిని.

# లోకవార్తలు



ఇంగ్లాండులో ప్రసవములనుగూర్చి పరిశోధనలు చేయగా తేలిన సంగతులు : 5 అ॥ 4 అం.ల కించు మించుగా పొడవున్న స్త్రీలు, 25 సం॥ లోపలి వయస్సువారైన, ఆరోగ్యంతో కూడుకొన్న చురుకైన శిశువులను కనగలుగుతున్నారు. పెద్దయింటివారు, వృత్తులవల్ల జీవించేవారు అయిన స్త్రీలవి సుఖప్రసవాలు; వారు కనేవారు బలమైన శిశువులు. 5 అ॥ల కన్నా పొట్టివారు, సంఘంలో అడుగు మెట్లనున్నవారు, (వీరిలో మొద్దుపని చేసే కూలీలు, పనిలేనివారు అయిన వారి భార్యలూ ఉన్నారు)-మొదలైన వారి ప్రసవాలు కష్టతరమైనవి. 378 మంది ఇట్టివారి ప్రసవములు గమనించగా - 15 మందికి ఆపరేషన్ అవసరమైంది. మరి 15 గురికి చచ్చిన శిశువులు పుట్టారు. ఇట్టి కారణాలవల్ల 1000 కి 55 చావులు. 5 అ॥లకు మించిన పొడవుగల్గి 25 సం॥ల, లోపలి వయస్సుగల 171 పడుచుల ప్రసవములలో ఇట్టివొక్క ప్రమాదమున్నూ లేదట.

♦ ♦ ♦

ఢిల్లీలోనున్న అమెరికా రాయబారి సిబ్బందికి చెందినామె యువిలిన్ కుమారి. ఆమె కొన్నాట్ భవనంలోకి కారులోవచ్చి - నిలిచింది. ముగ్గురు ఆమె వద్దకు వచ్చారు. అందులో ఒకడు రూపాయ నోటొకటి ఆమెచేతికిచ్చి 'మీరు దీన్నిక్రిందపారేసుకున్నారండి' అన్నాడు. ఆమె కృతజ్ఞతా పూర్వకంగా స్వీకరించి పర్సులో పెట్టుకుంటున్నది. మరొకడు "అయ్యో! ఏమిటో కారుక్రింద పడ్డది" అన్నాడు. వెంటనే ఆమె కారుదిగి 'ఏమిపడ్డదా' అని చూచుకొన్నది. ఇంతలో - ఆ ముగ్గురు దొంగలు ఆమె పర్సు పుచ్చుకొని పారిపోయారు.

పూనాలో నొక్క కుశాగ్రబుద్ధి - ఒకేసారి పలు సాధకములనువండదగినపొయ్యి నిర్మించాడట. సంసారాలకు పనికివచ్చేది రు 100 లు; హోటళ్లకు పనికి వచ్చేది - రూ. 500 లు కావచ్చునంటున్నారు.

♦ ♦ ♦

మలయాలో ఒక రాష్ట్రములో రంజాన్ పండుగ రోజులలో ఉపవాసము చేయనివాడు శిక్షార్హుడు.

♦ ♦ ♦

కాశీలో నొక గృహస్థు రేషన్ గోధుమలు కొల్పించుకొని ఇంటికివచ్చి చూచుకోగా అందులో రష్యాదేశపు వెండినాణె మొక్కటి కాన్పించినదట. అది గోధుమలతోపాటు విదేశాలనుండి రవణా అయినది.

♦ ♦ ♦

దక్షిణాఫ్రికాలో దేశీయులు అనేక తెగలవారున్నారు. అందొక తెగనాయకుడు లండన్ వైపిస్టు పడుచును, 24 సం॥ ఆమెను పెండ్లాడినాడు. ఈ పెండ్లి నంగీకరించవద్దుఅని డచ్ రిఫార్మ్డ్ చర్చివారు- తీర్మానముచేసి దక్షిణాఫ్రికా ప్రభుత్వమునకు పంపినారు.

♦ ♦ ♦

ఆమధ్య జెకోస్లోవేకియా అధ్యక్షుడు ఒకసారి- తన పొగత్రాగేగొట్టము పోయిందని పోలీసువారికి తెలియచేసినాడట. ఇంటికివచ్చి చూచుకొనేసరికి-తన పైజామా జేబులో అది కన్పించింది. పోలీసుఆఫీసరుకు ఫోనుచేసి అసంగతిచెప్పాడు. అంతట పోలీసు ఆఫీసరు ఇట్లుఅన్నాడట. "అది మీ పైజామా జేబులోఉండడం అసంభవం. ఇప్పటికి 5గురిని ఆనేరానికి అరెస్టుచేశాము. అయిదుగురున్నూ తాము దానిని దొంగతనం చేసినట్లు ఒప్పుకున్నారు."

# సంపాదకీయములు

## వృద్ధవివాహము.

ఇంకనువృద్ధవివాహములు ఏహ్యంకాకపోవడం విషాదకరము. అదిన్నీ- ప్రజాసేవయందారితేరిన వారిలోను సంభవించడం క్షంతవ్యముకాదు. శ్రీయి. వి. రామస్వామి నాయకర్ గారు కొన్నాళ్లు గొప్ప కాంగ్రెసువాది. పిదప బ్రాహ్మణేతరుల ఆత్మగౌరవ సంరక్షణోద్యమమును లేవదీసినవారు. శ్రీమతి మణి అమ్మైయారుకూడా ఆ ఉద్యమాభిలాషియై నాలుగైదేండ్లుగా 'విడుదలై' అనే తమిళపత్రిక సంపాదకత్వం వహించిన విదుషీమణి. ఇందు వధువువయస్సు 30; వరునివయస్సు 72 వీరిద్దరికిన్ని ఇంతఆక్షేపణ రేగిన తర్వాతకూడ తగదనితోచలేదు. ఏకాశయప్రియులు పెండ్లాడడంలోతప్పేమీలేదు. అసలుపెండ్లిఅనేది వ్యక్తిగతమైనసంబంధము: ప్రజకది అనవసరము. అయితే 40 సంలపైబడ్డతేడాగలవయస్సువారు పెండ్లాడమే లోకవిరుద్ధము. ఈదాంపత్యము లోకవిడ్డూరము అసహజముఅని మేము నిరసించుచున్నాము.

## రష్యారాయబారి రాధాకృష్ణగారు

గతసంచికలో మా మిత్రులు శ్రీ రాధాకృష్ణగారు రష్యారాయబారిగా నియమింపబడతారనే సూచనయెడల మా సంతోషాన్ని వెలిబుచ్చియున్నాము. నేడు వారాపదవికి నియమింపబడ్డట్లు ఖాయంగా ప్రభుత్వ ప్రకటన జరగడం మాకెంతో ఆనందదాయకం. ఈ వార్త వెలువడగానే అన్ని పత్రికలున్నూ వారి గుణగణాలను, విద్యావైదుష్యాలను, శక్తి సామర్థ్యాలను ప్రశంసిస్తూ వీరెంతైనా ఈ పదవికి తగినట్లు అమరిఉన్నారని వ్రాశాయి. ముఖ్యంగా ప్రస్తుతం ప్రపంచ వ్యవహారాల్లో రష్యాఆక్రమించియున్న విలక్షణమైన స్థానానికి తగినట్లుగా ఆ రాజ్యంలో భారతదేశానికి ప్రాతినిధ్యం వహించగల విలక్షణమైనవ్యక్తిఅని వారందరి అభిప్రాయం. ఆంధ్రమాతగన్న బిడ్డలలో ఈ శతాబ్దంలో ఇంతప్రఖ్యాతిగన్న పురుషుడితడే. శ్రీ రాధాకృష్ణ గారి కీశ్వరుడాయురారోగ్యములిచ్చి ఇతోధిక కీర్తి గౌరవములు ప్రసాదించుగాక.

## సంతాన నిరోధము

సంతాన నిరోధము అవలంబించడంవల్ల బ్రిటిష్‌దీవులలోను మిగిలిన పాశ్చాత్య ప్రపంచంలోనుకలిగిన

ప్రమాదాలు వివరంగా "బ్రిటిష్ రాయల్ కమిషన్" రిపోర్టునుండి సంగ్రహించి వేరుగా ప్రకటింపబడినవి. మనదేశంలో కూడా ఆర్థికదారిద్ర్యాన్ని దుర్కొనడానికి అదే మార్గమని శ్రీమతి సూర్యదేవర శకుంతలాదేవి మొదలైనవారు గాఢంగా తలుస్తున్నారు. లోగడ అఖిలభారత మహిళామహాసభ ఇచ్చట జరిగినప్పుడు సభాధ్యక్షురాలుకూడా సూచించినది. కాని, మేము సర్వదా అందుకు వ్యతిరేకులమై మా అభిప్రాయమును స్పష్టీకరిస్తున్నాము. మేము ఛాందసంగా దానిని కాదనడంలేదు. కాలక్రమాన అది దేశారిష్టకరము అనే మావాదన - సుమారు 70 సం॥ల అనుభవంమీద ఇంగ్లాండులో ఆ సంగతే కనుక్కొన్నారని ప్రచురింపబడ్డపై రిపోర్టులోని వివరాలు ఋజువు పరుస్తున్నాయి.

## తాత్కాలికపు యెన్నికలు

నూతన రాజ్యాంగచట్టము ననుసరించి వయోజన ఓటింగుహక్కు ప్రకారము ఎన్నికలు జరుగుట ఆలస్యమగునని త్వరలో వెనుకటి ఓటర్లజాబితాలమీదనే ఎన్నికలు తాత్కాలికముగ జరిపింపదగునని కొందరు పెద్దలు తలచుచున్నారు. త్వరలో కూడనున్న అఖిలభారత కాంగ్రెసు వర్కింగు కమిటీ వారును ఆలోచింపనున్నారు. వయోజన ఓటింగుహక్కు ప్రకారము ఎన్నికలు జరుగుట ప్రజాప్రాతినిధ్య విధానమున కవసరమే. కాని తాత్కాలికపు ఎన్నికలు, ప్రస్తుతపు ఓటర్లజాబితా ప్రకారంజరిగే యడల కొన్ని మార్పులు చేయదగును. ముఖ్యంగా క్రొత్త చట్టంలో - ప్రత్యేకపు ప్రాతినిధ్యములు, స్థానముల రిజర్వేషన్ విరమింపబడినవి. కాని పూర్వచట్టమున స్త్రీలకు కొన్ని స్థానములు ప్రత్యేకింపబడినవి. అయితే పురుషులకుగల స్థానములనుగూడ స్త్రీలు పోటీ చేయవచ్చు. అయినా రిజర్వేషన్ తొలగుట అవసరము. స్త్రీలు ప్రథమంనుండీన్నీ ప్రత్యేక ప్రాతినిధ్యమును నిరాకరించుచుండిరి. స్త్రీలు పురుషులతో సరాసరిపోటీ చేయుటయే గెల్చినా, ఓడినా సరసము - అని మా అభిప్రాయము.




మా కార్యాలయమున స్వీకరింపబడి ఇంకను విమర్శకై వేచియున్న గ్రంధములు: జయప్రకాశ్ లేఖలు, చారుణి, వత్సరాజు, యోగసిద్ధి, తిరుగుబాటు దారులు పురోగమించాలి, అష్టావక్రచరిత్రము, శ్రీమహర్షి జీవిత కధావృత్తాంతము, నెహ్రూచరిత్రము, ఆపరేషన్ వైద్యము, ముక్కాని, గాంధీ తాత, భారతీయ తత్వ శాస్త్రము. కామచికిత్స, మహమ్మదీయ రాజ్యాలలో జాతీయవికాసం, భారతము క్రైస్తవ సామ్రాజ్యము, శ్రీగురుగీత, సౌందర్యలహరి, తిక్కన, మౌలానా అజాద్, సంసారపక్షము, అభిషేకనాటకం, మనవారి సత్వము, తోకచుక్క, ప్రకృతివిజయం, గీతాగాంధీయం, భారతాభ్యుదయము. తెలుగుపూలు, ఉదయిని రాధారాణి, సావిత్రి, మించుపల్లె, తెలుగు పొలుపు, దంతిముఖోదంతము, శివమహిమ, గద్యరత్న మంజూష, కలరా, అగస్టువిప్లవ నాయకులు, చి॥ సౌ॥ కమలాదేవి, అపశ్రుతి. గాంధీమహాత్ముని ఉత్తమపురుష లక్షణములు, నలచరిత్ర, వసంత కానుక, రాష్ట్రగీత, జాతీయగీతములు, ఆగస్టువిప్లవం దాని ఆవశ్యకత, శ్రీరంగేశ శతకం, విజయనగర యాదవ సామ్రాజ్యము, దేశంకోసం, మాతృనివేదము.

ఇవి వరుసక్రమమున విమర్శింపబడును.

హిందీ తెలుగు స్వయంబోధినీ. గ్రంధకర్త: శ్రీ బైసాని శ్రీరాములు గుప్తగారు లోకమాన్య హిందీమందిర్, బిసెంటురోడ్డు, గవర్నర్ పేట, విజయవాడ. ధర రు 1.8-0.

ఎంత పెనుగులాడిన దక్షిణభారతీయులు హిందీ నేర్చుకోక తప్పదు. హిందీసాహిత్యవేత్తలుగా అందరూ తయారు కాకపోవచ్చుగాని సామాన్యజ్ఞానముమాత్రం అలవడితీరాలి. అట్టిజ్ఞానం- ఇతరులఅపేక్ష లేకుండా స్వయంకృషివల్ల అలవరచుకోడానికి ఈ "స్వయంబోధిని" ఎంతైనా ఉపయుక్తం. వెనుక 25సం॥ల క్రితం - జంధ్యాల శివన్నశాస్త్రిలుగారు కాబోలు ఇట్టి "స్వబోధినీ" యొకటివ్రాసి ప్రచురించారు. కాని యిప్పుడవి కన్పించవు. ఆలోటు ఈ గ్రంధం తీరుస్తుంది.

రాయల హిందీ తెలుగు పహిలీ కితాబ్. గ్రంధకర్త: శ్రీ విద్వాన్ ఏ. సి. కామాక్షిరావుగారు దొరుకుచోటు: రాయలు అంకుకో., కడప. ధర రు 0-9-0.

ఈ వాచకము చాలా సులభశైలిలో సామాన్యపదములలో హిందీ చదువ మొదలుపెట్టువారి కత్యంత ముపయుక్తముగా వ్రాయబడినది; ధరయు స్వల్పము.

ఇల్లాలివైద్యం. గ్రంధకర్త: వైద్య శ్రీ రాజవైద్యాచార్య వలివాడ సూర్యనారాయణ భిషక్ - దొరుకుచోటు: రాధాకుటీరం, విజయవాడ. ధర తెలియదు.

మేము ప్రతిసంచికలో వెలువరించు గృహవైద్యములోవలెనే శ్రీభిషక్ గారు కొన్ని చికిత్సలనిందు పొందు

పరచిరి. గ్రంథకర్తపేరులోనున్న భేషజము ఈ చికిత్సలయందు కన్పించదు. అమాయకురాలైన ఇల్లాలును సులభముగా అవలంబించదగినవే.

వాణి. సంపాదకులు: మద్రాసు ఆలిండియా రేడియో స్టేషన్ డైరెక్టరు. దొరకు చోటు: ఆలిండియా రేడియో స్టేషన్ మద్రాసు. ధర విడి పత్రికకు రు 0-5-0 లు; సం॥ చందా రు 7-8-0.

ఇది ఆలిండియా రేడియో మద్రాసుశాఖవారు ప్రచురించు పక్షపత్రిక. ఆపక్షమున మద్రాసు, ఢిల్లీ, తిరుచునాపల్లి స్టేషనులలోగల కార్యక్రమము తెలుగున ప్రకటింపబడుచున్నది. ఇదివరకిదిలేదు. ఈవిధముగా ఆంధ్రులకొరత తీర్చినందుకు ఆలిండియా రేడియోవారికి ఆంధ్రులు కృతజ్ఞులు. అందముగాను ఆకర్షణీయముగాను ఇది ప్రకటింపబడుచున్నవి.

మాతృశ్రీ: కోటసోదరకవులు కనిగిరి, నెల్లూరి జిల్లా. వెల రు 1-0-0

ఇదియొకచిన్న ఖండకావ్యము. కావ్యకర్తలగు శ్రీకవిచంద్రులు, కోటసోదరకవులు, శతావధానులు, గృహలక్ష్మి పాఠకులకు చిరపరిచితులు. వారికవితామృతమును సుపరిచితమే. వీరు చిరుతవయస్సునందే దాదాపిరువది కావ్యములవరకు రచించి పేర్గాంచియున్నారు. వీరి ధారాశుద్ధి, శైలి, భావనాశక్తి, పదలాలిత్యము విలక్షణమైనది. ఈ కావ్యము, విద్వదౌషధము. అనిపేరువడసిన నైషధకావ్యమును సంస్కృతమున రచించిన శ్రీహర్షకవి చరిత్రము. శ్రీ డాక్టరు కే. యస్. కేసరిగారి కంకితము. ఇది పాఠ్యగ్రంథముగా నిర్ణయింపదగినది. వీరిట్లే పలు కావ్యముల రచించి కీర్తివడయుదురుగాక.

# శ్రీ విరోధినామ సం||ర ఆషాఢ, శ్రావణమాసములు.

| | | | |
|---|---|---|---|
| | 16 | శ | షష్ఠి 34.5 ఉ భా 56.26 దివి 16-3 దక్షిణాయనపుణ్యకాలః. |
| | 17 | ఆ | స 39.9 శ 60.0 ది వి 29.40 భానుసప్తమీ. |
| | 18 | సో | అ 43.52 శ 2.54 రావి 25.43 రుద్రసావర్ణిక మన్వాది. |
| | 19 | మం | న 47 57 అశ్వ 8.58 రావి 2.51. |
| | 20 | బు | ద 51.3 భ 14.15 రావి 14.9 రంధ్రయోగః. |
| | 21 | గు | ఏ 52.58 కృ 18.32 సర్వేషామేకాదశీ. |
| జూలై | 22 | శు | ద్వా 53.40 రో 20.38 దివి 0.36 పుష్య. |
| | 23 | శ | త్ర 53.5 మృ 23.27 రావి 12.29. |
| | 24 | ఆ | చతు 51.16 ఆర్ద్ర 24.2 రావి 21.35. |
| | 25 | సో | ● 48.20 పున 24.9 రావి 10.48. |
| | | | **శ్రావణమాసము.** |
| | 26 | మం | పాడ్యమి 44.26 పుష్య 20.55 రావి 20.28. |
| | 27 | బు | వి 39.41 ఆశ్రే 19.26 రావి 15.42. |
| | 28 | గు | త 34.17 మ 16.10 రావి 2.5 |
| | 29 | శు | చ 28.28 పూఫ 12.32 వివి 29:19 చతుర్థితిథి. |
| 1949-వ సం\|\| | 30 | శ | పం 22.20 ఉఫ 2-59 దివి 2.81 తిథిద్వయం. |
| | 31 | ఆ | ష 16.6 హ 4.18 దివి 22.55 సప్తమీతిథి. |
| | 1 | సో | స 10.3 చి 0.10 స్వాతి ది 13.17 అనధ్యయనం. |
| | 2 | మం | అ 4.18 నవమి 54.48 విశా ది 9.37 కౌమారిదేవిపూజా. |
| | 3 | బు | ద 54.34 అనూ 50.26 ది 2.38. [గురువార వ్రతం |
| | 4 | గు | ఏ 50.57 జ్యే 48.41 స్మార్తానాం వైష్ణవానాం ఏకాదశీ; ఏకాదశి |
| | 5 | శు | ద్వా 48.19 మూ 47.55 వి 12.8 మధ్వానామేకాదశీ. |
| | 6 | శ | త్ర 46.54 పూషా 48.17 దివి 12.4 శనిత్రయోదశీ. |
| | 7 | ఆ | చతు 46.42 ఉషా 49.53 ది 8.49 వరాహజయంతి. |
| ఆగస్టు | 8 | సో | ○ హా 47.46 శ్రీ 52.4 దివి 0.20 ఆపస్తంబాశ్వలాయన వాజసనేయినాం [చోపాకర్మరక్షా బంధనం |
| | 9 | మం | బ పా 50.6 ధ 56.46 దివి 3.23 ఆశ్రే. |
| | 10 | బు | వి 53.32 శ 60.0 ది 16.18. |
| | 11 | గు | త 53.51 శ 1.52 దివి 19.27 |
| | 12 | శు | చ 60 0 పూభా 7.48 రావి 2.46 సంకట గణపతివ్రతం. |
| | 13 | శ | చ 2.47 ఉభా 15.54 |
| | 14 | ఆ | పం. 7.52 రే 20.44 శూ 31.17. |
| | 15 | సో | ష 12.41అశ్వ 26.56 దివి 15.54. |

Printed and Published by Dr. S. Seshagiri Rao at the Lodhra Press, Kesari Kuteeram Ltd
15, Westcott Road, Royapettah, Madras. Editor : Dr. K. N. Kesari.